ఈ చిత్ర కథను సెప్టెంబరు '72 నెల 'చందమామ'లో చదవండి!




దర్శకత్వం వి.రామచంద్రరావు B.A.(HONS)
నిర్వహణ ఎ.పూర్ణచంద్రరావు
నిర్మాత ఎ.శేషగిరిరావు

ఈ చిత్రములోని పాటలు కొలంబియా రికార్డులలో వినండి.


ఏమా వృద్ధి! ఏమా వింత!
టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే
పెంచగలిగితే అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది
ఇన్‌క్రెమిన్ ఇవ్వండి... అది అధిక ఆహారమును అధిక పెరుగుదలగా మారుస్తుంది.


Incremin
drops





PRIME MINISTER

## MESSAGE

Our children need books and journals which will awaken their minds to the marvels of creation and the living universe of ideas. Publications for children must arouse imagination, create aesthetic awareness, encourage the desire for knowledge and at the same time teach them to live in harmony with their own society and the world.

My good wishes for the continued success of "Chandamama".

New Delhi,
July 15, 1972.

(Indira Gandhi)

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ నెల బేతాళ కథ ["చీలిన దారులు"] మునవర్ మహమ్మద్ పంపినది.

"ఒక రోజు రాజు" అన్న పెద్ద కథను ఈ సంచిక నుంచి ప్రారంభిస్తున్నాము.

తన కింద పనిచేసే వాళ్ళ మనస్తత్వాలు అర్థం చేసుకునే శక్తిచాలని వాడు మంచివాళ్ళనూ, చెడ్డవాళ్ళనూ కూడా శంకిస్తాడు. ఒకరిపై ఒకరిని నిఘా ఉంచుతాడు. మంచి పనివాళ్ళ దగ్గిర ఈ పద్ధతి బెడిసి కొడుతుందన్న నీతి "అనుమానం మనిషి" అన్న కథలో కనబడుతుంది.

---

సంపుటి 51 ఆగష్టు '72 సంచిక 2

CHITRA



# మిరియపుగింజ

పూర్వం వానాజీ అనే రాజపుత్రబాలుడు ఉండేవాడు. అతని చిన్నతనంలోనే తండ్రి పోవటం చేత అతను తన పెత్తండ్రుల అండన పెరిగాడు.

వాళ్ళు వానాజీకి రాజపుత్ర సంప్రదాయాలన్నీ నేర్పారు. అతను పసితనంలోనే గుర్రపు స్వారీ, విలువిద్యా, అస్త్రవిద్యలూ చక్కగా నేర్చుకున్నాడు.

ఒక పొగరుబోతు గుర్రాన్ని ఎవరూ అదుపు చెయ్యలేకపోగా, వానాజీ దాన్ని అదుపులోకి తెచ్చి, మచ్చిక చేసి, దాన్ని ఎక్కి తిరగసాగాడు. తన పెత్తండ్రులు గుర్రాలెక్కి తిరిగేటప్పుడు వానాజీ వారి వెంట తాను కూడా తిరిగేవాడు. ఆ గుర్రం కూడా వానాజీని తప్ప మరెవరినీ ఎక్కనిచ్చేదికాదు.

ఒకనాడు ఒక వర్తకుడు రాజభవనానికి కాండ్లా నుంచి కొన్ని ఖడ్గాలు తెచ్చాడు. వానాజీ ఆ కత్తుల వద్ద కూర్చుని ఒక్కొక్క కత్తి నిడివీ, పదునూ పరీక్షించి, ఏదీ నచ్చక, ఒక్కొక్కటే తీసి పక్కన పెడుతూ వచ్చాడు.

"ఈ అబ్బాయికి ఖడ్గాల నాణ్యం బాగా తెలుసులాగున్నదే!" అనుకుని వర్తకుడు మంచి ఖడ్గం ఒకటి తీసి వానాజీకి చూపించాడు.

ఆ కత్తిని చూడగానే వానాజీ కళ్ళు మెరిశాయి. "నాకిలాటి ఖడ్గమే కావాలి. ఇది ఉంటే నన్నెవరూ జయించలేరు!" అన్నాడతను ఉత్సాహంతో.

అతను ఆ ఖడ్గాన్ని తన పెత్తండ్రుల వద్దకు తీసుకుపోయి దాన్ని తనకు కొని పెట్టమని అడిగాడు.

"మేము బతికి ఉండగా నీకు ఖడ్గంతో ఏం పని, బాబూ?" అని ఒక పెత్తండ్రి అడిగాడు.

రాజపుత్ర జానపద కథ

"ఈ ఖడ్గం మరీ పెద్దది. నువు పట్ట లేవు," అన్నాడు మరొక పెత్తండ్రి.

"నేను పెరిగిపోతున్నాను. నా కున్న ఖడ్గం మరీ చిన్నదిగా ఉన్నది." అన్నాడు వానాజీ.

"ఖడ్గం పొడుగుగా ఉండటం ముఖ్యం కాదురా! దాన్ని పట్టిన వాడి ధైర్యసాహ సాలు ముఖ్యం. ఖడ్గం పొడుగు తక్కువై నప్పుడు శత్రువు కేసి ఒక అడుగు ముందుకు పోయి పోరాడాలి," అన్నారు వానాజీతో పెత్తండ్రులు.

వానాజీ నిరాశ చెంది ఆ ఖడ్గాన్ని వర్త కుడికి తిరిగి ఇచ్చాడు.

కొన్నాళ్ళు గడిచాక కొందరు బందిపోటు దొంగలు గ్రామం మీద పడి, ఆవులమంద లన్నిటినీ తోలుకుపోయారు. అలాటిది జరిగి నప్పుడు గ్రామస్థులు డప్పులు వాయిం చటం రివాజు.

రాజభవనంలో ఉన్న వానాజీకి డప్పుల మోత వినిపించింది. ఆ మోత ఏమిటని అతను అడిగితే, దొంగలు పశువులను తోలుకుపోతున్నారని చెప్పారు.

వానాజీ తనలో, "కోటలో నేను ఉండి కూడా ఈ అన్యాయం జరగనిస్తానా? మా పెత్తండ్రులకు ఎంత అపమానం! మా అమ్మ నన్ను చూసి సిగ్గుపడదా?" అనుకున్నాడు.

అతను వెంటనే తన గుర్రం ఎక్కి, ఖడ్గం ఝళిపిస్తూ, బందిపోటు దొంగల వెనకగా దౌడుతీశాడు.



అరణ్యం లోపలగా అతను దొంగలను కలుసుకున్నాడు.

దొంగల నాయకుడు ఆ కుర్రవాణ్ణి చూసి నవ్వి, "బుడ్డవాడా, నీకింకా మీసకట్టయినా రాలేరు గదా, మా నుంచి పశువులను ఎలా తీసుకుపోదా మనుకుంటున్నావు?" అన్నాడు.

ఇది మాటలతో తేలే విషయం కాదనుకుని వానాజీ తన గుర్రాన్ని దొంగల నాయకుడికి దగ్గిరగా నడిపి, తన కత్తితో అకస్మాత్తుగానూ, బలంగానూ దొంగలనాయకుడి తల కేసి కొట్టాడు.

దొంగ తల పక్కకు తిప్పటంతో వానాజీ కత్తి దెబ్బకు అతని ముక్కూ, మూతీ తెగి పోయాయి.

వాడు ఆవేశంతో, "చంపండి కుర్ర కుంకని! చుట్టుముట్టి పట్టుకుని, ముక్కలుగా నరకండి!" అని అరిచాడు.

ఈ అడావుడిలో గోవులమంద గ్రామం కేసి పరిగెత్తి పోయింది. వానాజీ కూడా, తాను అంతమంది దొంగలతో పోరాడలేనని గ్రహించి, గుర్రాన్ని వెనక్కు తిప్పి, దౌడు తీయించాడు.

దొంగలు వానాజీ వెంట పడ్డారుగాని, వానాజీ గుర్రం అతి వేగంగా పరిగెత్తటం చేత గ్రామాన్ని చేరేలోగా అతన్ని అందుకో లేకపోయారు.

గ్రామంలో పశువులు పోయాయని ఏడుస్తున్న గ్రామస్థులు అవి తిరిగి రావటం చూసి ఆశ్చర్యపోయారు. వానాజీని చూసి వారు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

అంత చిన్నవాడు దొంగల ముఠా నుంచి పశువులను ఎలా రక్షించాడో ఎవరికీ అర్థం కాలేదు.

తరవాత వానాజీతో అతని పెత్తండ్రులు, "ఇప్పటి నుంచే నీకీ దుడుకు దేనికిరా, బాబూ? పెరిగి పెద్దవాడివైనాక ఎన్ని సాహసకార్యాలైనా చేద్దువు గాని!" అన్నారు.

"నేను చిన్నవాణ్ణి అయితేనేం? మిరియపుగింజను! ఘాటు జాస్తి!" అన్నాడు వానాజీ.





# ఐదు రొట్టెలు

ఒకనాడు సోమయ్యా, కామయ్యా అనే బాట సారు లిద్దరు ఒక పేదరాసిపెద్దమ్మ ఇంట కలుసుకున్నారు. వారు పెద్దమ్మ ఇంట రాత్రి గడిపి, మర్నాడు ఉదయం ప్రయాణం కొనసాగించేటప్పుడు పేదరాసి పెద్దమ్మ వారికి దిబ్బరొట్టెలు చెరొక మూట కట్టి, దారిలో తినటానికి ఇచ్చింది. సోమయ్య కొంచెం ఉదార బుద్ధిగలవాడు. కామయ్య కాస్త పిసినిగొట్టు. అందుచేత పేదరాసి పెద్దమ్మ సోమయ్య మూటలో మూడు రొట్టెలు పెట్టి, కామయ్య మూటలో రెండే ఉంచింది.

కొంత దూరంపాటు ఇద్దరి దారులూ ఒకటేకావటం వల్ల సోమయ్యా, కామయ్యా కలిసే నడిచి, మిట్టమధ్యానం వేళకు ఒక చెరువు గట్టున చెట్టునీడను చేరుకున్నారు.

వాళ్ళు చెరువులో కాళ్ళు కడుక్కొని, భోజనం చెయ్యటానికి మూటలు విప్పేసరికి, సోమయ్య మూటలో మూడు రొట్టెలూ, కామయ్య మూటలో రెండే రొట్టెలు కనిపించాయి.

"చూశారా, పేదరాసి పెద్దమ్మ పక్షపాతం? మీకు మూడు రొట్టెలు కట్టి ఇచ్చి, నా మూటలో రెండే పెట్టింది," అన్నాడు కామయ్య.

సోమయ్య నవ్వి, "రెండు రొట్టెలు మాత్రం తినగలమా? కానివ్వండి, అంతగా తినగలిగితే ఐదు రొట్టెలూ ఇద్దరమూ సమంగా పంచుకుని తిందాం," అన్నాడు.

ఆ మాటతో కామయ్య కాస్త తృప్తి పడ్డాడు. వాళ్ళు రొట్టెలు తినటానికి ఉపక్రమించబోతూ ఉండగా, అదే చెట్టునీడకు రామయ్య అనే మూడో బాటసారి వచ్చాడు.

రామయ్య ఆ ఇద్దరి దగ్గిరా ఆహారం ఉండటం గమనించి, "అయ్యలారా, మీలాగే నేనూ ఆకలిగొని ఉన్నాను.

యస్. మార్కండేయులు



మీ ఆహారంలో నాకు కొంత ఇచ్చారంటే మీ రుణం ఉంచుకోను," అన్నాడు.

"మా వద్ద ఉన్న రొట్టెలు మన ముగ్గురికీ సరిపోకపోవు. మీరు కూడా మాతోపాటు భోజనం చెయ్యండి," అన్నాడు సోమయ్య.

రామయ్య వారితోబాటు భోజనానికి కూర్చున్నాడు. ఉన్న రొట్టెలను ముగ్గురూ సమంగా పంచుకుని తిని, చెరువులో నీరు తాగి ఆకలి తీర్చుకున్నారు.

రామయ్య మిగిలిన ఇద్దరికీ కృతజ్ఞతలు చెప్పుకుని, సోమయ్యకు డబ్బు ఇవ్వబోయాడు. కాని సోమయ్య వద్దన్నాడు. అయినా రామయ్య అయిదణాలు సోమయ్య చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

సోమయ్య ఆ అయిదణాలలో రెండు తీసి కామయ్యకు ఇస్తూ, "మీ వంతు మీరు పుచ్చుకోండి. నావి మూడు రొట్టెలూ, మీవి రెండు రొట్టెలూ గద! ఈ అయిదణాలలో రెండు మీకు చెందటం న్యాయం," అన్నాడు.

"ఇది చాలా అన్యాయం! రామయ్య మన ఆహారం తిన్న కృతజ్ఞతతో డబ్బు ఇచ్చాడు. ఇది మన ఇద్దరికీ సమంగా చెందాలి. నాకు మరో అర్ధణా వస్తుంది," అన్నాడు పిసినిగొట్టు కామయ్య.

సోమయ్యకు కామయ్య పిసినిగొట్టుతనం చూసి ఒళ్ళు మండుకొచ్చింది.

"పదండి, మనం గ్రామానికి వెళ్ళి, న్యాయాధికారి నడిగి న్యాయం తేల్చుకుందాం," అన్నాడు సోమయ్య.

ఇద్దరూ ఒక గ్రామం చేరుకుని, అక్కడి న్యాయాధికారి వద్దకు వెళ్ళి, ఆయననే న్యాయం పరిష్కరించమన్నారు.

న్యాయాధికారి ఇద్దరి మాటలూ శ్రద్ధగా విని, కామయ్య కేసి తిరిగి, "న్యాయం చెప్పాలంటే, రామయ్య ఇచ్చిన అయిదు అణాలలో నాలుగణాలు సోమయ్యకు చెందుతాయి. నీకు ఒక అణా మాత్రమే వస్తుంది. అందుచేత, సోమయ్య నీ కిచ్చిన రెండు అణాలలో ఒకటి సోమయ్యకు తిరిగి ఇచ్చెయ్యి." అన్నాడు.

ఈ తీర్పు విని కామయ్య నిర్ఘాంత పోయాడు.

''అయ్యా, ఇదేం న్యాయం? మా మా రొట్టెల సంఖ్యనుబట్టి చూసినా నాకు రెండణాలు రావాలి కద? నన్ను అణా మాత్రమే తీసుకోమంటున్నారేమిటి?'' అన్నాడు కామయ్య న్యాయాధికారితో.

''అవును. నేను చెప్పినదే న్యాయం. అది ఎలా న్యాయమో చెబుతాను. అసలు అయిదు రొట్టెలను మీరు ముగ్గురూ ఎలా పంచుకున్నారు?'' అన్నాడు న్యాయాధికారి.

''చిత్తం! ఒక్కొక్క రొట్టెనూ మూడేసి సమభాగాలు చేశాం. అయిదు రొట్టెలూ పదిహేను భాగాలు అయాయి. వాటిలో ఒక్కొక్కరమూ అయిదేసి ముక్కలు తిన్నాం,'' అన్నాడు కామయ్య.

''భాగించినాక నీ రొట్టెలు ఎన్ని ముక్కలు అయాయి?'' అని న్యాయాధికారి అడిగాడు.

''చిత్తం! ఆరు ముక్కలు అయాయండి,'' అన్నాడు కామయ్య.

''అందులో అయిదు నువే తిన్నావు. నువు రామయ్య కిచ్చినది ఒకే భాగం. సోమయ్యవి మూడు రొట్టెలు. అవి తొమ్మిది భాగాలు అయాయి. అందులో సోమయ్య అయిదు మాత్రమే తిని, నాలుగింటిని రామయ్య కిచ్చాడు. రామయ్య తాను తిన్న అయిదు ముక్కలకూ అయిదు అణాలిచ్చాడు. అందులో ఒకే ముక్క నీదీ, మిగతా నాలుగూ సోమయ్యవీ గనక, రామయ్య ఇచ్చిన అయిదణాలలో ఒకటి నీకూ, మిగిలిన నాలుగూ సోమయ్యకూ చెందాలి. నేను చెప్పినది న్యాయమేగదా?'' అన్నాడు న్యాయాధికారి.

సోమయ్య తన కిచ్చిన రెండణాలలో ఒకటి సోమయ్యకు తిరిగి ఇయ్యబోయాడు కామయ్య. కాని సోమయ్య తీసుకోక, ''న్యాయస్థానాలకు పోతే ఇదే జరుగుతుంది. ఏమైనా మనిషికి కాపీనం తగదు,'' అన్నాడు.

తరవాత సోమయ్యా, కామయ్యా ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.





తావ న్మహతాం మహిమా
యావ న్న కిమపి హి యాచ్యతేలోకః ;
బలి మనుయాచనసమయే
శ్రీపతి రపి వామనో జాతః. 1

[గొప్పవారి మహిమ ఎంతవరకనగా, ఎవరినీ యాచించనంతవరకే! బలిచక్రవర్తిని యాచించినపుడు లక్ష్మీదేవి భర్త కూడా వామనుడయాడు.]

మాతా నిందతి, నాభినందతి పితా,
భ్రాతా న సంభాషతే,
భృత్యః కుప్యతి, నానుగచ్ఛతి సుతః,
కాంతాపి నాలింగతే,
అర్థప్రార్థనశంకయా న కురుతే
సల్లాపమాత్రం సుహృత్,
తస్మా దర్థ ముపార్జయ శృణుసఖే
హ్యర్థేన సర్వే వశాః. 2

[దరిద్రుణ్ణి తల్లి నిందిస్తుంది, తండ్రి మెచ్చడు, భ్రాతలు పలకరించరు, పనివాడు కోప్పడతాడు, కొడుకు వెంటరాడు, భార్య దూరాన ఉంచుతుంది, డబ్బు అడుగుతాడన్న భయంతో మిత్రుడు పలకరించనైనా పలకరించడు. డబ్బుంటే అందరూ స్వాధీనులవు తారు. అందుచేత డబ్బు సంపాదించాలి.]




# యక్షపర్వతం

## 3

[బందిపోట్లనాయకుడు స్వర్ణాచారి అనే వాణ్ణొకణ్ణి పట్టుకుని, అతడి ద్వారా అరణ్యంలోని ఒక కుటీరంలో నివసిస్తున్న యిద్దరు క్షత్రియయువకుల్ని గురించి తెలుసుకున్నారు. ఆ సమయంలో విఘ్నేశ్వరపూజారి అనేవాడు బందిపోట్ల పైకి పెంపుడు సింహాన్ని ఉసికొల్పాడు. అది బందిపోట్లలో ఒకడి మీదపడి, గట్టిగా గొంతుపట్టుకున్నది. తరవాత—]

హఠాత్తుగా గర్జిస్తూ వెనక వస్తున్న తన అనుచరుడి మీద పడిన సింహాన్ని చూస్తూనే బందిపోట్లనాయకుడు అదిరిపడ్డాడు. అతడు ఒక్క క్షణం ఏమిచేయటమా అని ఆలోచించి, చప్పున ఈటెను పైకెత్తి, సింహాని కేసి బలంగా విసిరాడు. ఈటె పోయి సింహానికి ఒక అడుగు దూరంలో నేలకు తగిలి, నిలువుగా గుచ్చుకుపోయింది. సింహం మాత్రం బందిపోటును గొంతు పట్టుకుని అటూ యిటూ విదిలిస్తూ నేల మీద పొర్లించటం మానలేదు.

బందిపోట్లనాయకుడు చుట్టూ ఓసారి కలయ చూశాడు. సింహం పట్టులో చిక్కిన బందిపోటువాడి ఒంటె బెదిరి క్షత్రియ యువకుల కుటీరం వెనక వున్న చెట్ల కేసి పారిపోయింది. మరొక అనుచరుడున్న ఒంటె మీది నుంచి స్వర్ణాచారి రక్షించండి, అంటూ- బిగ్గరగా కేకలు పెడుతున్నాడు.



బందిపోట్లనాయకుడికి యిక తాను తన అనుచరుణ్ణి సింహం బారి నుంచి కాపాడలేనని తెలిసిపోయింది. సింహం నోట చిక్కిన ఆ బందిపోటు రెండు మూడుసార్లు పెద్దగా అరిచి పూరుకున్నాడు. ఇప్పుడు సింహం వాణ్ణి దూరంగా విదిలించి పారవేసి, వెనక కాళ్ళ మీద కూర్చుని చిన్నగా గర్జిస్తూ బందిపోట్ల నాయకుడి కేసీ, ముందున్న బందిపోటు లాక్కుపోతున్న పాడిఆవు కేసీ చూడసాగింది.

ఈసారి సింహం తన మీదో లేక తన అనుచరుడి మీదో తప్పక దూకుతుందని బందిపోట్లనాయకుడు భయపడ్డాడు. అది ముఖ్యంగా ఆహారం కోసం అవును పట్టుకోవాలని చూస్తున్నదని అతడు పొరబడ్డాడు. అవును వదిలి వేస్తే తమకు సింహాన్నుంచి ఎలాంటి ప్రమాదమూ రాకపోవచ్చు....

బందిపోట్లనాయకుడు యిలా అనుకుని తన అనుచరుడితో, "ఒరే, ఉష్ట్రవెధవా! నీ తెలివి తక్కువ తనం వల్లనే మనవాడొకడు చచ్చాడు. సింహగర్జన వింటూనే నువ్వు అవును వదిలివేస్తే యీ ప్రమాదం సంభవించేది కాదు. సింహం అవును తరుముకుంటూ అరణ్యంలోకి పోయేది. ఇప్పటికైనా బుద్ధిగా అవును వదిలి పెట్టు." అని, కేకలు పెడుతున్న స్వర్ణాచారి కేసి రౌద్రంగా చూస్తూ, "ఒరే, వాస్తుపక్షి! ఇకనైనా నోరుమూసుకుని మా వెంటవస్తావా, లేకపోతే ఒంటె మీది నుంచి కిందికి పడదోసి సింహానికి మేతగా వెయ్యమంటావా?" అన్నాడు.

ఈ ప్రశ్న స్వర్ణాచారికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. క్షత్రియ యువకుల పెంపుడు సింహం తనకు బాగా మాలిమి అయినదే. అది తనను ఏమీ చేయదు. ఆ కారణంగా అతడు లేని భయాన్ని నటిస్తూ, "ఉష్ట్రనాయకా! నన్ను సింహానికి మేతగా వెయ్యండి. ఆ విధంగానైనా జన్మభూమిలోనే మరణిస్తాను. జన్మభూమి కన్న ప్రియమైన వస్తువు మరేం వున్నది!" అన్నాడు.



బందిపోటునాయకుడికి ఓ క్షణకాలం స్వర్ణాచారిని ఒంటె మీది నుంచి కింద పడ వేయటమే మంచిదనిపించింది. కాని, అతడికి మరుక్షణంలో తాను కొండచరియ ప్రాంతాల కట్టనున్న రాజధానీ నగరం మాట గుర్తు కొచ్చింది. ఆ కారణంగా అతడు తన అనుచరుడితో, "ఒరే, ఆ వాస్తుపక్షిని యిక్కడ సింహానికి ఆహారంగా వదలకు. మనం నిర్మించబోయే కొండకోట పట్టణానికి వాడి సాయం కావలిసి వస్తుంది. అక్కడ వాడు అంతగా మన మాట వినకపోతే, అప్పుడు ముక్కలు ముక్కలుగా నరికి ఏ తోడేళ్ళ పొట్టలో నింపుదాం," అన్నాడు.

ఈ మాటలతో స్వర్ణాచారికి నిజంగానే చావు భయం కలిగింది. అతడు సింహాని కేసి తిరిగి, "భీమా! భీమా!" అంటూ పెద్దగా కేక పెట్టి, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

పెంపుడు సింహం పేరు భీముడు. అది తన పేరు చెవుల పడగానే గర్జిస్తూ లేచి, ఒకసారి జూలు విదిలించుకుని స్వర్ణాచారి వున్న ఒంటె కేసి దూకింది. కాని, యీలోపలే రానున్న ప్రమాదాన్ని గుర్తించిన బందిపోటు ఆవు మెడకు వున్న తాడును చప్పున వదిలి, ఒంటెను గట్టిగా అదిలించాడు. ఒంటె జొన్నపోలాల కేసి పరుగు లంకించుకున్నది. దాని వెనకగా బందిపోటునాయకుడు కూడా తన ఒంటెను వేగంగా పరిగెత్తించాడు.

ఈ జరిగినదంతా విఘ్నేశ్వర పూజారి కుటీరం వెనక వుండి చూస్తూనే వున్నాడు. ఎంతో కాలంగా తనకు మిత్రుడుగా వుంటూ కష్టసుఖాల్లో తనను వదలని స్వర్ణాచారి బందిపోట్లకు బందీ అయిపోవటం అతడికి ఎంతో బాధ కలిగించింది. సమయానికి క్షత్రియ యువకులు కుటీరంలో వున్నట్టయితే, యీ విపత్తు కలిగి వుండేది కాదు.

విఘ్నేశ్వరపూజారి యింతగా అనుకునే ఆ క్షత్రియ యువకులిద్దరూ ఆ సమయంలో అరణ్యంలో వేట ముగించి తమ కుటీరాల వైపుకే బయలుదేరి వస్తున్నారు. ఆ రోజున



జరిగింది కదా! మరి అది బోనులో నుంచి ఎలా బయట పడింది? కర్మం కాలి సింహం ఎవరికైనా ప్రాణహాని కలిగించలేదుగదా!

యువకులు యిలాంటి అనుమానాలతో ఒకరి ముఖం కేసి ఒకరు ప్రశ్నార్థకంగా చూసుకునేంతలో విఘ్నేశ్వర పూజారి చెట్ల వెనక నుంచి వాళ్ళ ముందుకు పరిగెత్తుకుంటూ వస్తూ, "మహా యోధుల్లారా, ఖడ్గ జీవదత్తుల్లారా! పుట్టిమునిగింది, కొంప లంటుకున్నై, సర్వనాశనం జరిగిపోయింది!" అన్నాడు.

ఆ మాటలకు క్షత్రియయువకు లిద్దరూ ఓ క్షణకాలం నివ్వెరపోయారు. వాళ్ళల్లో ఒకడు పూజారి కేసి నిశితంగా చూస్తూ, "ఏమిటా సర్వనాశనం? నువ్వూ, మేమూ, చుట్టూ వున్న అరణ్యం పచ్చగా కళకళలాడుతూ బతికే వున్నాంగదా! మరి ఆ జరిగిపోయిన సర్వనాశనం ఏ ప్రాంతాల? మాకు ఆశ్చర్యం కలిగిస్తున్నదల్లా, యీ భీముడు బోనులో నుంచి ఎలా బయట పడగలిగాడా అన్నదే!" అని సింహం జూలు పట్టుకుని వేళ్ళతో దువ్వసాగాడు.

విఘ్నేశ్వరపూజారి ఆ క్షత్రియ యువకులిద్దరికీ అంతకు ముందు కుటీరం ప్రాంతాల జరిగిన భీభత్సం సంగతి గబగబా చెప్పి, "ఖడ్గ జీవదత్తుల్లారా! ఇక్కడ కాలయాపన చేయటం దేనికి? త్వరగా కుటీరం దగ్గిరకు

వాళ్ళకు వేట బాగా సాగింది. ఒక యువకుడి భుజాన్నుంచి లేడి ఒకటి వేళ్ళాడుతున్నది. రెండవ యువకుడి భుజం మీద రెండు అడవికోళ్ళూ, చేతిలో నాలుగు కుందేళ్ళూ వున్నవి. వాళ్ళు నిశ్చింతగా కబుర్లాడుకుంటూ నడుస్తున్నారు.

ఆ యువకులిద్దరూ తమ కుటీరానికి కూతవేటు దూరంలో వుండగా పెంపుడు సింహం చిన్నగా గర్జిస్తూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, గిరికీలు తిరుగుతూ, యువకుల్లో ఒకడి కాళ్ళను చుట్టుకోసాగింది. సింహాన్ని చూసి ఆ యువకులు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. తాము వేటకు బయలుదేరేటప్పుడు దాన్ని బోనులో పెట్టటం

రండి. అక్కడ భీముడి పంజా దెబ్బలకు చచ్చిన బందిపోటు శవాన్ని కూడా మీరు చూడవచ్చు. ఆ మహా విఘ్నేశ్వరుడి కృప వల్ల పాడిగేవూ, గోవత్సం మాత్రం మనకు దక్కాయి,'' అన్నాడు.

పూజారి చెప్పినదంతా విన్న ఖడ్గ జీవ దత్తులకు ఆశ్చర్యంతో పాటు, ఎక్కడ లేని కోపావేశం కూడా కలిగింది. తాము వుంటున్న మహారణ్యంలో ఆదిమవాసులైన అనేక తెగల మానవులు నివసిస్తున్నారని మాత్రమే యింత వరకూ వాళ్ళకు తెలుసు. ఒంటెలను యీనాటి వరకూ వాళ్లా ప్రాంతాల చూసి ఎరగరు. అలాంటి పరిస్థితుల్లో ఒంటెల మీద వచ్చిన బందిపోట్లు తమ కుటీరంలో జొరపడటమేగాక, తమకు అతిథి సమానుడైన స్వర్ణాచారిని బలవంతంగా ఎత్తుకు పోవటం వాళ్ళకు ఎక్కడ లేని కోపాన్ని తెప్పించింది.

"జీవా, యిక మనం యిక్కడ కాల యాపన చేయకూడదు. ఆ బందిపోట్లు వెళ్ళిన మార్గం ఏదో పూజారి మనకు చెప్పాడు గదా. మనం వెంటనే బయలుదేరి పోయి స్వర్ణాచారిని వాళ్ళ బారి నుంచి విడిపించి, ఆ దుర్మార్గుల్ని నరికి పోగులు వేద్దాం,'' అంటూ ఖడ్గవర్మ కత్తి దూశాడు.

జీవదత్తుడు తన మిత్రుడి భుజం మీద చేయి వేసి, "ఖడ్గా, ముందు వెనుకలు




చూడకుండా శత్రువుల కేసి దుమకటం ప్రమాద కారణం అవుతుంది. ఆ శత్రువుల సంఖ్య ఎంత? వాళ్ళు మన కుటీరం కేసి పనిగట్టుకు రావడం వెనక ఏదైనా రహస్యం వున్నదా? ఇవన్నీ సావధానంగా ఆలోచించాలి. పైగా ఎక్కడో ఎడారుల్లో మాత్రమే వాహనాలుగా ఉపయోగించే ఒంటెలను, ఆ దుర్మార్గులు యీ అరణ్యంలోకి ఎందుకు తెచ్చారు?... సరే, ముందు కుటీరంలో నుంచి వాళ్ళు ఏమేమి ఎత్తుకుపోయారో వెళ్ళి చూద్దాం,'' అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు కుటీరం ముందుకు వెళ్ళేంతలో, వెనక వస్తున్న విఘ్నేశ్వర పూజారి వాళ్ళను ఆపి, "యోధుల్లారా!



లాగే పని. పాపం, భీముడి కేం తెలుసు! కోపం కొద్దీ పంజా దెబ్బలతో పాటు, వాడి కోరలతో గొంతు కూడా పట్టుకున్నది." అన్నాడు ఖడ్గవర్మ.

తరవాత యువకులిద్దరూ కుటీరంలోకి వెళ్ళారు. అక్కడ చాలా వస్తువులు చెల్లా చెదురుగా కింద పడవేసి వున్నవి. గోడకు వేళ్ళాడుతూ వుండవలసిన రెండు ధనుస్సులూ, ఒక మూలగా పెట్టివుంచిన అంబులూ వాళ్ళకు కనిపించలేదు.

"ఈ బందిపోట్లకు మన కుటీరంలో కనిపించిన విలువగల వస్తువులు ధనుస్సులూ, అంబులూ అన్న మాట! వీళ్ళను వదల రాదు, వేటాడి తీరవలసిందే! వాళ్ళు ఎటు నుంచి వచ్చారో, ఎటు పోయారో ఖడ్గజాతి వాళ్ళల్లో కొందరైనా తప్పక చూసే వుంటారు," అని జీవదత్తుడు, పూజారితో, "విఘ్నేశ్వర పూజారీ! నువ్వు కొంచెం వెళ్ళి యీ చుట్టుపక్కల ఎవడైనా ఖడ్గజాతి వాడు కనిపిస్తే, వెంటనే వాణ్ణి యిక్కడికి తీసుకురా!" అన్నాడు.

విఘ్నేశ్వర పూజారి కుటీరం నుంచి బయటికి వచ్చేసరికి, ఆ పరిసరాల్లో వున్న మోకాళ్ళ ఎత్తు కంచె పక్కగా ఖడ్గజాతి వాళ్ళ నాయకుడు అరణ్యమల్లూ, అతడి అనుచరులు కొందరూ రణగొణ ధ్వనిగా మాట్లాడుకుంటూ రావటం అతడికి కని

ఇదిగో యీ పొద పక్కన నేల వాలి వున్న శత్రుశవాన్ని తిలకించండి! భీముడి పంజా దెబ్బకు వీడు వీరస్వర్గం అలంకరించాడు," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు బందిపోటు శవం వున్న చోటుకు పోయారు. ఖడ్గవర్మ కాలితో శవాన్ని అటూ యిటూ కదిలించాడు. జీవదత్తుడు శవం కేసి పరీక్షగా చూసి, "వీడు అడవిజాతి వాడు కాదు. దుస్తుల తీరూ, ముఖ లక్షణాలూ చూస్తూంటే, ఎక్కడో దూర ప్రాంతం నుంచి యీ అరణ్యాల్లోకి వచ్చినట్టుంది," అన్నాడు.

"వీడు కాస్త ప్రాణంతో వున్నట్టయితే, ప్రశ్నించి అన్ని రహస్యాలూ బయటికి

పించింది. వెంటనే విఘ్నేశ్వర పూజారి వాళ్ళ కేసి గబగబాపోయి, "క్షత్రియ యువకులు వేట నుంచి యిప్పుడే తిరిగి వచ్చారు. ఒంటెల మీద వచ్చిన బంది పోట్లను మీలో ఎవరైనా చూశారా? వాళ్ళు నా ప్రాణమిత్రుడైన స్వర్ణాచారిని ఎత్తుకు పోయారు," అన్నాడు.

ఆ మాటలకు అరణ్యమల్లు చిన్న బుచ్చుకుని, "పూజారీ, మేం ఆ బంది పోట్లను చూడటం ఏమిటి? వాళ్ళు మా పంట పొలాలను దోచుకు పోతూండగా ఎదిరించి, వాళ్ళ ధాటికి తట్టుకోలేక - పారిపోయాం కూడా. స్వర్ణాచారి వాళ్ళ వింత జంతువుల్లో ఒక దాని మీద వుండటం నా అనుచరుల్లో కొందరు చూశారు. ఖడ్గ జీవదత్తు ప్రభువులు సమయానికి యిక్కడ వున్నట్టయితే, ఆ దుర్మార్గుల్లో ఒక్కడు కూడా ప్రాణాలతో పోగలిగేవాడు కాదు," అన్నాడు.

బయట రేగిన కలకలం విని ఖడ్గ జీవ దత్తులు కుటీరం నుంచి వెలుపలికి వచ్చారు. అరణ్యమల్లు వాళ్ళ దగ్గిరకు పోయి, "ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! మహా విపత్తు జరిగి పోయింది. మా పంట పొలాలను బంది పోట్లు దోచుకు పోయారు. ఓటమి ఎరుగని మా ఖడ్గమృగజాతి వీరులు, వాళ్ళ ధాటికి నిలబడలేక అరణ్యపురానికి పారిపోయి వచ్చారు," అన్నాడు.

అరణ్యమల్లు యిలా అనగానే ఖడ్గ జీవ దత్తులకు ఆ వచ్చిన ఒంటెల వాళ్ళు కేవలం బందిపోటు వృత్తి మీద బతికే రకం మనుష



లని అర్థమైపోయింది. కాని, వాళ్ళు ఖడ్గ మృగాల మీద వున్న ఆటవికుల్ని ఎదిరించి ధైర్యంగా నిలబడటమే గాక, వాళ్ళను తేలిగ్గా ఓడించి పారదోలగలగటం వాళ్ళకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

"రాజువైన నువ్వూ, ఆ బందిపోట్లకు వెన్నిచ్చి పారిపోయావా? నీ పిరికితనం చూసి నీ అనుచరు లేమనుకుంటారు?" అన్నాడు ఖడ్గవర్మ కోపంగా.

"అయ్యో, ఆ పారిపోయింది నేను. రాజుగారు ఆ బందిపోట్ల కేసే రాలేదు," అంటూ మంత్రి శిలాముఖి ఖడ్గ జీవదత్తుల ముందుకు వచ్చాడు.

"అలాగా! వాళ్ళు మనం ఎరగని కొత్త ఆయుధాలేమైనా మీ మీద ప్రయోగించారా? లేక ఆ ఒంటెల్ని చూసి మీ ఖడ్గమృగాలు బెదిరి పారిపోయాయా?" అని అడిగాడు జీవదత్తుడు.

శిలాముఖి కొండవాగు దగ్గిర జరిగిన దంతా చెప్పి, "ఆ బందిపోట్ల దగ్గిర కత్తులూ, ఈటెలూ తప్ప మరేం లేవు. కాని, ఒంటె అని మీరు చెప్పే ఆ వింత జంతువును చూసి మా వాళ్ళు ఎందుకనో చాలా భయపడిపోయారు. లోగడ ఆ ఒంటెను మా వాళ్ళు చూసి వుండలేదు," అన్నాడు.

"సరే, జరిగిందేదో జరిగిపోయింది. మేం స్వర్ణాచారిని వాళ్ళ నుంచి విడిపించుకు రావాలి. అంతేకాక ఆ దుర్మార్గులు మరే నాడూ యిటు రాకుండా తగిన శిక్ష విధించాలి. కనక మీలో కొందరు బయలుదేరి, వాళ్ళు పోయిన దారి గుర్తులు తెలుసుకుని రండి! మేం యిద్దరం సూర్యాస్తమయానికి యింకా రెండు మూడు గంటల కాలం వున్నదనగా బయలుదేరి పోతాం," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు మాట పూర్తి చేసేలోపలే అరణ్యమల్లు తన అనుచరులలో నలుగురిని దగ్గిరకు పిలిచి బందిపోట్లు పోయిన మార్గం తెలుసుకుని రమ్మని ఆజ్ఞాపించాడు. ఆ వెంటనే ఆ నలుగురూ ఖడ్గమృగాలను ఎక్కి కొండవాగు కేసి బయలుదేరారు.

—(ఇంకా వుంది)





# వేషధారులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు స్వర్గ సుఖాలు కోరి ఇలా శ్రమపడుతున్నట్టయితే, నీ ప్రయాస వృథా అయిపోవచ్చు. ఎందుకంటే, పరమ దుర్మార్గులకు కూడా స్వర్గంలో చోటు ఉన్నది. అందుకు నిదర్శనంగా నీకొక చిన్న కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వారణాసిలో ఒక గురుకులం ఉండేది. అక్కడికి అన్ని ప్రాంతాల నుంచీ బ్రహ్మచారులు విధ్యాభ్యాసం నిమిత్తం వచ్చేవారు. ఒకసారి ఆ గురుకులానికి తేజసింహుడు అనే కుర్రవాడు, పదేళ్ళవాడు, వచ్చాడు. అతను మంచి చురుకైనవాడు, చదువు

బేతాళ కథలు

కుంటూ అతను రోజూ అరణ్యానికి వెళ్ళి, సమిధలు తెచ్చేవాడు.

ఆ అడవిలోనే తేజసింహుడికి అఘోర దాసు అనే కుర్రవాడు, అతని ఈడు వాడే పరిచయమయాడు. రోజూ ఇద్దరూ అడవిలో కలుసుకుని కబుర్లు చెప్పుకునే వారు. అఘోరదాసు తేజసింహుడికి తమ ఆటవిక జీవితం గురించి వివరంగా చెప్పేవాడు. అఘోరదాసు తండ్రి ఆటవికుల నాయ కుడు. అతను దారులు కొట్టటంలో గొప్ప నేర్పరి. అతన్ని గురించి నగరాలలో గజ దొంగ అని చెప్పుకునేవారు. అఘోరదాసు తండ్రి తాను కొల్లగొట్టిన ధనంతో ధనికుడు అయిపోక, దాన్ని తమ జాతి కంతకూ సమంగా పంచేవాడు. ఆ ఆటవిక జాతి వాళ్ళు మహాశక్తిని పూజించేవారు. ఆ మహా తల్లిని పూజించకుండా వాళ్ళు ఏ పనీ చేసే వారు కారు.

అఘోరదాసూ, అతని జాతివాళ్ళూ అనాగరికంగా జీవించటం తేజసింహుడికి బాధ కలిగించింది. అతను తన మిత్రుణ్ణి, "నువు కూడా పెద్ద వాడివై మీ తండ్రిలాగే బతుకుతావా? నాగరికంగా బతకకూడదా?" అని అడిగాడు.

"ఎన్నో తరాలుగా వస్తున్న మా జీవితం ఎలా మార్చుకోను? నీ చదువు వేరు, నా చదువు వేరు. నీ జీవితం వేరు, నాజీవితం వేరు. నిన్ను మాలాగా బతకమంటే అది నీకు సాధ్యం అవుతుందా? నాకూ అంతే!" అన్నాడు అఘోరదాసు.



వారిద్దరి మధ్యా అన్నీ తేడాలే. అయినా అది వారిస్నేహానికి అడ్డురాలేదు.

కొన్ని ఏళ్ళకు తేజసింహుడి విద్యాభ్యాసం ముగిసింది. అతను చివరిసారి అడవికి వెళ్ళి, తన ప్రాణస్నేహితుడైన అఘోరదాసును కలుసుకుని, అతనికి వీడ్కోలు చెప్పి వచ్చేశాడు.

తరవాత కొద్దికాలానికే తేజసింహుడు కాశీ రాజుగారి కొలువులో చేరాడు. అరణ్యంలో అఘోరదాసు తన తండ్రి చనిపోగా, తమ జాతికి నాయకుడై, తండ్రిని మించి సాహసం ప్రదర్శిస్తూ, అద్భుతమైన నేర్పుతో దారిదోపిడీలు చేయనారంభించాడు.

రాను రాను అఘోరదాసు చేసే దారిదోపిడీలు మితిమీరిపోయాయి. వారణాసికి వచ్చే పోయే ధనికులకూ, వర్తక బృందాలకూ అతను సింహస్వప్నమయి పోయాడు. అతన్ని పట్టటానికి రాజు చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరు అయాయి. అరణ్యంలో అటవికులకు ఉండే స్థానబలం రాజుగారి సైనికులకు లేకపోయింది.

అఘోరదాసును పట్టుకున్న వారికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేసి, తన అనంతరం రాజయేటట్టు చేస్తానని రాజు ప్రకటించాడు. ఈ ప్రకటన విని చాలామంది యోధులు అఘోరదాసును పట్ట యత్నించారు. అయితే వారి ప్రయత్నాలు కూడా వృథా అయాయి.

తేజసింహుడు తన చిన్ననాటి మిత్రుడి చర్యలను గురించి విన్నప్పుడు చాలా బాధ





పడేవాడు. తాను ప్రయత్నించి ఉంటే అఘోరదాసు తన వెంట వచ్చి నాగరిక జీవితంలో రాణించేవాడేననీ, గట్టి ప్రయత్నం చెయ్యకపోవటం తన తప్పే ననీ అతను అనుకున్నాడు. అఘోరదాసును పట్టటం తన ఒక్కడికే తెలుసును. ఆటవిక జీవితం సమగ్రంగా తెలిసినవాడు రాజుగారి కొలువులో మరొకడు లేడు. అయినా చాలాకాలం అతను అఘోరదాసును పట్టటానికి ప్రయత్నించనే లేదు.

తేజసింహుడు చూస్తూండగానే నగరంలోని జీవితం స్తంభించి పోసాగింది. నగరంలో ఉండే వర్తకులు పై దేశాలకు పోవటం మానేశారు. 'పై దేశాలవాళ్ళు రావటమూ నిలిచిపోయింది. నగరంలో సంక్షోభం తల ఎత్తి, నానాటికీ తీవ్రమయింది.

ఆ పరిస్థితిలో తేజసింహుడు నగర ప్రజల క్షేమం కోరి, కొద్దిమంది సైనికులను వెంటబెట్టుకుని, రాత్రివేళ అఘోరదాసు ఒంటరిగా మహాశక్తిని పూజించటానికి వెళ్ళే సమయంలో పట్టుకుని, నగరానికి తెచ్చాడు.

రాజుగారు తాను ప్రకటన చేసిన ప్రకారం తన కుమార్తెను తేజసింహుడి కిచ్చి పెళ్ళిచేసి, రాజ్యాభిషేకం కూడా చేశాడు.

తేజసింహుడు అఘోరదాసుకు యావజ్జీవకారాగృహవాస శిక్ష విధించి, భోజనం మొదలైనవాటికి ఏ లోటూ లేకుండా ఏర్పాటు చేశాడు.

అఘోరదాసు పట్టుబడటంతో అరణ్యంలో దొంగతనాలు నిలిచిపోయాయి. అఘోరదాసు కాలక్రమాన ముసలివాడై, కారాగృహంలోనే మరణించాడు.

తేజసింహుడు తన రాజ్యాన్ని చాలా చక్కగా పరిపాలించి, ప్రజల సుఖసౌఖ్యాలూ, సంపదా వృద్ధి అయేటట్టు చూసి, గొప్ప ఖ్యాతి తెచ్చుకున్నాడు.

కాలక్రమాన తేజసింహుడు కూడా దేహం చాలించాడు. అతనికి స్వర్గం లభించింది. స్వర్గంలో అతనికి అఘోరదాసు ఎదురుపచ్చాడు. అలాటి చోట అఘోర

దానును చూసి మొదట తేజసింహుడు ఆశ్చర్యపడి, తరవాత ఎంతో సంతోష పడ్డాడు. ఇద్దరి స్నేహమూ స్వర్గంలో అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, అఘోర దాసు దారిదోపిడీలు చేసిన పాపి. తేజ సింహుడు మిత్రద్రోహం చేసిన పాపి. ఈ పాపు లిద్దరికీ స్వర్గం ఎలా సంప్రాప్త మయింది? తేజసింహుడి విద్యాభ్యాసం పూర్తి అయాక చీలిపోయిన ఇద్దరి దారులూ స్వర్గంలో ఎలా కలుసుకున్నాయి? వాళ్ళ స్నేహం తిరిగి ఏ కారణంచేత కొనసాగింది? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తేజసింహుడూ, అఘోరదాసూ వేరువేరు ధర్మాలు గల వాళ్ళు. వాళ్ళ సమాజాలూ, సంస్కృతులూ, జీవిత విధానాలూ ఒకటి కావు. ఎవరి ధర్మాన్ని వారు నెరవేర్చటం పాపం కాదు. ఆటవికుల నాయకుడుగా అఘోర దాసు దారిదోపిడీలు చేసి, తన జాతిని వృద్ధి పరచి పుణ్యం సంపాదించుకున్నాడు. అలాగే, అఘోరదాసు చేసే దోపిడీలు అరికట్టి తేజసింహుడు తన సమాజానికి మేలు చేకూర్చి పుణ్యం కట్టుకున్నాడు. అతను రాజకుమార్తె కోసంగాని, రాజ్యం కోసంగాని, మరొక స్వార్థంతోగాని అఘోరదాసును పట్టుకోలేదు. అందుచేత ఇద్దరికీ స్వర్గం లభించింది. ఇక, స్నేహం అన్నది వ్యక్తుల మధ్య ఏర్పడే భావం. దానికి సమాజంతో సంబంధం లేదు. అందుకనే, తేజసింహుడు విద్యార్థిగా ఉంటున్న కాలంలోనే అఘోర దాసుతో స్నేహం కుదిరింది. ఈ లోకం దాటినాక నిలిచేది వ్యక్తులేగాని సమాజ ధర్మం కాదు. సమాజధర్మం కేవలమూ ఇహలోకానికి సంబంధించినది. అందుచేత, స్వర్గంలో వాళ్ళ స్నేహం అవిచ్ఛిన్నంగా కొనసాగింది." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# పాపం లేదు

ఒక స్వాములవారు తత్వం వినవచ్చిన జనానికి ధర్మబోధ చేస్తున్నాడు. అక్కడికి ఇద్దరు దొంగలు వచ్చారు. అందులో ఒకడు స్వాములవారి బంగారు గిన్నెను చల్లగా కాజేసి చంకలో దాచుకున్నాడు. అది చూసి రెండో దొంగ, "స్వాములారి సొత్తు దొంగిలించటం పాపంరా," అన్నాడు.

"స్వాములారే ఇస్తే పాపం లేదుగద?" అన్నాడు మొదటి దొంగ.

ధర్మబోధ ముగిసి అందరూ వెళ్ళిపోతుండగా ఆ దొంగ స్వాముల వారి దగ్గిరికి పోయి, "స్వామీ, నేనొక అపచారం చేశాను. ఒక బంగారు గిన్నెను దొంగిలించాను," అన్నాడు.

"దాన్ని తీసుకు పోయి, యజమానికి ఇయ్యి. నిన్ను పాపం అంటదు," అన్నాడు స్వాములవారు.

"మీకే ఇచ్చేస్తాను, పుచ్చుకోండి," అన్నాడు దొంగ.

"నాకు వద్దు. అది ఎవరిదో వారికే ఇయ్యి." అన్నాడు స్వాములవారు.

"వారు తీసుకోకపోతేనో?" అన్నాడు దొంగ.

"అప్పుడు నువే ఉంచుకోవచ్చు," అన్నాడు స్వాములవారు.

దొంగ స్వాములవారికి నమస్కారం చేసి, తేడు దొంగతో సహా వెళ్ళిపోయాడు.





# అనుమానం మనిషి

ఒక గ్రామంలో సుబ్బయ్యశెట్టి అనే షావుకారు ఉండేవాడు. ఆయనకు వ్యాపారమూ, వడ్డీ వ్యాపారమూ ఉండేది. ఆయన కింద రాయుడు అనే పెద్ద గుమాస్తా, నాయుడు అనే చిన్న గుమాస్తా, ఇంటిపనికి ఒక పనివాడూ ఉండేవాళ్ళు. ఈ ముగ్గురూ నమ్మదగినవాళ్ళే, కాని శెట్టికి వాళ్ళమీద ఏ మాత్రమూ నమ్మకం లేదు. ఎందుచేతనంటే, ఆయన అనుమానం మనిషి.

అయితే శెట్టి తన స్వభావాన్ని ఆ ముగ్గురికీ ఏ మాత్రమూ తెలియనిచ్చేవాడు కాడు. ఆయన ప్రవర్తన చూసి ఆ ముగ్గురిలో ఎవరికివారు, శెట్టికి తన మీద ఉన్నంత నమ్మకం మరెవరి మీదా లేదనుకునేవారు.

శెట్టి వ్యాపారరీత్యా ఒకసారి దూరాన ఉన్న పట్టణం పోవలిసి వచ్చింది. బయలుదేరే ముందు ఆయన తన భార్యతో, "ఏమే, నేను తిరిగి వచ్చేదాకా పనివాణ్ణి ఓ కంట కనిపెట్టి ఉండు. వాడు నమ్మదగినవాడు కాడు," అన్నాడు.

భార్య అలాగే చేస్తానన్నది.

తరవాత శెట్టి పనివాణ్ణి ఒంటరిగా పిలిచి, "ఒరే, నిన్ను తప్ప నేను మరొకరిని నమ్మలేను. నువ్వొక పని చెయ్యాలి," అన్నాడు.

"దానికేం, బాబు? అలాగే చెప్పండి," అన్నాడు నౌకరు.

"మరేమీ లేదు. మన చిన్న గుమాస్తా నాయుడున్నాడే, అతని బుద్ధి అంత మంచిదిగా కనబడటం లేదు. నేను తిరిగి వచ్చేదాకా అతన్ని నువు ఓ కంట కనిపెట్టి ఉండాలి," అన్నాడు శెట్టి.

"ఓ, అలాగే! మీరు నిశ్చింతగా వెళ్ళి రండి!" అన్నాడు ఇంటి నౌకరు.

ఆ తరవాత శెట్టి చిన్న గుమాస్తాను ఒంటరిగా కలుసుకుని, "ఇదుగో,

బూర్లె నాగేశ్వరరావు



నాయుడుగారూ! నిన్ను నమ్ముకుని నేను పట్నం వెళుతున్నా నన్నమాట! పెద్ద గుమాస్తా రాయుణ్ణి ఎలా కనిపెట్టి ఉంటావో ఏమో!" అన్నాడు రహస్యంగా.

యజమానికి తన మీద గల విశ్వాసానికి నాయుడు ఉబ్బి తబ్బిబ్బవుతూ, "ఆ సంగతి మీరు చెప్పాలి టండీ? అతన్ని వెయ్యి కళ్ళతో కనిపెట్టే పూచీ నాదీ!" అని ధైర్యం చెప్పాడు.

శెట్టి ఆఖరుకు పెద్ద గుమాస్తా రాయుడుండే గదికి వెళ్ళి, "రాయుడుగారూ, నేను పట్నం వెళుతున్నాను. నీకు నేను ప్రత్యేకంగా చెప్పవలిసిందేమీ లేదు. వ్యాపారపు లావాదేవీలు జాగ్రత్త! అడ్డమైన వాళ్ళందరినీ నమ్మవద్దు!" అనిచెప్పి పట్నం వెళ్ళిపోయాడు.

శెట్టి వెళ్ళిపోయాక, ఆయన చెప్పిన పనులను అందరూ శ్రద్ధగా ఆచరించసాగారు. రెండు మూడు దినాలు గడిచాక, చిన్న గుమాస్తా తనపై వేగు చేస్తున్నట్టు పెద్ద గుమాస్తా పసికట్టాడు; ఇంటి నౌకరు తన మీద ఒక కన్ను ఉంచిన సంగతి చిన్న గుమాస్తా గ్రహించాడు; శెట్టి భార్య తనను వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉన్న సంగతి నౌకరు గ్రహించాడు.

ఇదంతా శెట్టి చేసిపోయిన ఏర్పాటని వారికి తెలీదు. ఎవరిమటుకు వారు, తమ మీద వేగు చేస్తున్నవారిని శెట్టి చేత శిక్షింపజేయాలని నిశ్చయించుకుని, అందుకు తగిన ఎత్తులు ఆలోచించుకున్నారు.

ఒక రోజు, పెద్ద గుమాస్తా రాయుడు ఎవరితోనూ ఏమీ అనకుండా, పెద్ద పెద్ద పళ్ళాల నిండా బియ్యమూ, పప్పూ, ఒక చెంబు నిండా నెయ్యీ తీసుకుని, చిన్న గుమాస్తా నాయుడు చూస్తూ ఉండగానే తన మనుషులచేత పట్టించుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

అది చూసి నాయుడు అమిత ఆనందం చెందాడు. శెట్టితో చెప్పి ఆయన గౌరవం పొందటానికై, అతను చూసినదంతా వివరంగా కాగితం మీద రాసుకున్నాడు.

మరొకరోజు ఆ చిన్న గుమాస్తాయే పని వాడు చూసే సమయంలో ఒక డబ్బుల సంచీని తీసుకుని, అటూ ఇటూ దొంగ చూపులుచూసి, తన జేబులో వేసుకున్నాడు.

"అమ్మ, దొంగా! దొరికావా?" అను కుని పనివాడు ఆ రోజూ, గంటా గుర్తు పెట్టుకున్నాడు.

ఇది జరిగిన మర్నాడే శెట్టిగారింటికి ఒక కొత్త కూరలమనిషి వచ్చింది. వెంటనే పనివాడు తాను చేస్తున్న పని మానేసివచ్చి, కూరలమనిషితో సరసాలాడసాగాడు.

అది చూడగానే శెట్టి భార్య, "ఓరి భ్రష్టుడా! అయ్యగార్ని రానీ, నీ భరతం పట్టిస్తాను!" అని బెదిరించింది.

"అయ్యగారొస్తే భయమా?" అని పని వాడు తన యజమానురాలిని మరింత రెచ్చ గొట్టాడు.

శెట్టి పట్నం నుంచి తిరిగిరాగానే, నౌకరు మీద శెట్టి భార్యా, చిన్న గుమాస్తా మీద నౌకరూ, పెద్ద గుమాస్తా మీద చిన్న గుమాస్తా రహస్యంగా ఫిర్యాదులు చేశారు.

అందరు చేసిన ఆరోపణలూ విన్న అనంతరం శెట్టి అందరినీ సమావేశపరిచి, "చూడండి! నేను అలా పట్నం వెళ్ళగానే మీరు ముగ్గురూ న్యాయమూ, ధర్మమూ పాటించకుండా, తెగబడి నా ఇల్లు దోచు కున్నారే! మీ వంటి నమ్మకద్రోహులను



పెట్టుకోవటం నా బుద్ధి తక్కువ కాదా?" అన్నాడు.

పెద్ద గుమాస్తా రాయుడు శెట్టితో, "దయ చేసి అదేదో సూటిగా చెప్పండి," అన్నాడు.

"చెప్పేదేముంది? మీరు ముగ్గురూ చేసిన పాడు పనులకు సాక్ష్యం ఉన్నది. నేరం ఒప్పుకుంటారా?" అన్నాడు శెట్టి.

అందుకు అందరూ సమ్మతించారు.

అప్పుడు శెట్టి రాయుడితో, "ఏమయ్యా, నువు ఫలాని రోజున పెద్ద పెద్ద పళ్ళాలతో బియ్యమూ, పప్పూ, చెంబు నిండా నెయ్యీ పట్టుకుపోలేదూ? ఇదేమన్నా మీ అత్తగారి ఇల్లు అనుకున్నావా? నువు చేసిన ఈ పని నాయుడు కళ్ళారా చూశాడు," అన్నాడు.

దానికి రాయుడు, "అయ్యా, శెట్టిగారూ! ఆ రోజు శ్రావణ శుక్రవారం. ఆ రోజే వరలక్ష్మీవ్రతం కూడాను. ఆ వ్రతంనాడు మనం బ్రాహ్మణులకు స్వయంపాకా లిస్తాం. నేను అదే చేశాను. తమరు మరిచిపోయినట్టున్నారు!" అన్నాడు.

శెట్టి నిర్ఘాంతపోయి, "అవునవును! మరిచాను! నువ్వేమీ అనుకోకు! పొరపాటయిపోయింది. ఇలాటిదేదో ఉండి ఉంటుందని అనుకుంటూనే ఉన్నా. నీ సంగతి వదిలెయ్యి. ఈ నాయుడి మాట ఏమిటి? ఇతను డబ్బునంచీ జేబులో వేసుకోవటం పనివాడు కళ్ళారా చూశాడే!" అన్నాడు.

అందుకు నాయుడు, "అవునండీ, తీసుకున్నాను. అది నా జీతం డబ్బు. పద్దులో రాసి ఉన్నదే? చూసుకోండి," అన్నాడు.

శెట్టి కంగారుపడి, "అవునవును. ఆ రోజు జీతం ఇచ్చే రోజనేది గుర్తే రాలేదు. కాకపోయినా, చెప్పేవాడికి బుద్ధి ఉండాలి! నేనైనా మాటవరసకు అడిగాను, మరొక విధంగా అనుకోకు," అన్నాడు.

ఆయన పనివాడి కేసి తిరిగి, "ఏంరా, నీ సంగతి ఏమిటి? నువ్వున్నది పని చెయ్యటానికి కాదూ?" అని అడిగాడు.

"అవునండి. నేను చేస్తున్నది కూడా పనేగా?" అన్నాడు పనివాడు.

"మరి, పని మానేసి కూరగాయలమ్మితో సరసాలు మొదలుపెట్టావుట గదరా, దౌర్భాగ్యుడా!" అన్నాడు శెట్టి.

"అయ్యో బాబోయ్! అదా? అది నా పెళ్ళామేనండీ! అమ్మగారికి తెలీక మీతో ఏదో చెప్పి ఉంటారు!" అంటూ పనివాడు కాస్త సిగ్గుపడ్డాడు.

తమలో ఒకరి మీద ఒకరికి చీలికలు తెచ్చిపెట్టినది శెట్టేనన్న సంగతి ముగ్గురికీ తెలిసిపోయింది. వాళ్ళకు శెట్టిపైన అసహ్యం పుట్టింది. వాళ్ళు ఆయనతో, "చూడండి, శెట్టిగారూ! మీలాటి అనుమానం మనిషి దగ్గిర పని చెయ్యటంచేత మేము కూడా నమ్మకద్రోహులం అయిపోవచ్చు. అందుచేత ఇక మీ కొలువు మాకు వద్దు. మాకు శలవు ఇప్పించండి!" అని వెళ్ళిపోయారు.





# అపూర్వ కంకణం

పూర్వం కాశీనగరంలో రైదాసు అనే ఒక చర్మకారుడు ఉండేవాడు. కబీరుకు గురువైన రామానందులవారే ఈ అంటరానివాడికి కూడా గురువు. ఆ కాలంలో ప్రసిద్ధులైన హిందీ కవులలో ఈయన కూడా ఒకడు.

రైదాసు తన కులవృత్తిని అవలంబించి, చెప్పులు కుట్టుతూ జీవించేవాడు. ఒకరోజు ఉదయాన ఆయన తన సామగ్రితో సహా తన మామూలు స్థానంలో కూర్చున్నాడు. కాని ఆ రోజు ఎంతసేపటికీ అతని వద్దకు ఎవరూ రాలేదు.

అపరాహ్ణం వేళకు ఒక బ్రాహ్మణుడు ఆ దారిన వచ్చి, తెగిపోయిన చెప్పుల జత అతని ముందు పడవేసి, వాటిని కుట్టి ఇవ్వమన్నాడు.

రైదాసు చెప్పులు కుట్టుతూ యాదాలాపంగా, "ఏ వూరు, బాబూ, మీది? ఏం పని మీద వచ్చారు?" అని అడిగాడు.

ఆ బ్రాహ్మణుడు గర్వంగా, "మాది కావేరీతీరం. గంగలో స్నానం చేసి పవిత్రుణ్ణి కావాలని వచ్చాను," అన్నాడు.

అందుకు రైదాసు, "మీ కావేరిలో నీరు లేదా, బాబూ? స్నానం కోసం ఎంతో శ్రమపడి ఇంతదూరం నడిచి రావాలా?" అని అడిగాడు.

ఆ మాటకు బ్రాహ్మణుడు నిర్ఘాంతపోయి, "ఇదేమిటి? సాక్షాత్తూ గంగ ఒడ్డున కాశీనగరంలో నివసిస్తూ ఇంతమాట అన్నావు! నీకు గంగ మహత్తు ఏమీ తెలిసినట్టులేదే? నువు ఎప్పుడైనా గంగలో స్నానం చేశావా?" అన్నాడు.

"ఇంతవరకు ఎన్నడూ చెయ్యలేదు, బాబూ." అన్నాడు రైదాసు.

అది విని బ్రాహ్మణుడు రైదాసును చూసి ఎంతో జాలిపడి, అతనికి గంగ గొప్పదనం వివరించి చెప్పి, అంత దగ్గిరలో

పాటీలు తిమ్మారెడ్డి

ఉంటూ కూడా గంగాస్నానం చెయ్యక పోవటం దురదృష్టమనీ, రైదాను జీవితం వృథా అనీ అన్నాడు.

దానికి రైదాను, "మన్ హై తో చంగా, కరౌతీ మే గంగా," అన్నాడు. "మనసు నిర్మలమైతే కొయ్యతొట్టిలోనే గంగ ఉన్నది," అని ఆ మాటకు అర్థం.

ఇలా అంటూ రైదాను చెప్పులుకుట్టే పని పూర్తి చేసి, "బాబూ, నాకొక చిన్న సాయం చేసిపెట్టగలరా?" అని అడిగాడు.

చేతనైతే చేస్తానన్నాడు బ్రాహ్మణుడు.

"నా జీవితంలో ముప్పాతిక భాగం ఇక్కడే గడిచిపోయింది. నాకు గంగా దర్శనం చేసుకునే యోగం ఉన్నదో, లేదో. మీరు స్నానం చేసేటప్పుడు నా పేర ఈ పోకచెక్క గంగకు సమర్పించండి." అని రైదాను తన సంచీలో నుంచి ఒక పోకచెక్క తీసి బ్రాహ్మణుడి చేతిలో పెట్టాడు.

ఆ బ్రాహ్మణుడు దాన్ని తీసుకుని వెళ్ళిపోయాడు. తరవాత ఆయన గంగాస్నానం చేస్తూ, "గంగమ్మ తల్లీ, ఇదుగో రైదాను నీ కిచ్చిన కానుక," అంటూ పోకచెక్కను ప్రవాహంలో వదిలాడు.

అప్పుడు అకస్మాత్తుగా ఒక అందమైన చెయ్యి ప్రవాహంలో నుంచి పైకి వచ్చింది. ఆ చేతిలో నవరత్నఖచితమైన సువర్ణ కంకణం ధగధగా ప్రకాశిస్తున్నది.

"ఇది రైదానుకు నా కానుకగా ఇయ్యి." అన్న మాటలు వినిపించాయి.



ఈ సంఘటనకు బ్రాహ్మణుడు దిగ్భ్రాంతుడై, ఆ కంకణం తీసుకుని ఒడ్డుకు వచ్చాడు. దీర్ఘంగా ఆలోచించిన మీదట ఆయన ఇలా అనుకున్నాడు:

"తన పోకచెక్కకు ప్రతిఫలంగా గంగ ఈ రత్నకంకణం ఇచ్చిన సంగతి ఆ చెప్పులు కుట్టుకునేవాడికి ఎలా తెలుస్తుంది? అందుచేత పనిగట్టుకుని వెళ్ళి ఈ కంకణాన్ని వాడికి ఇవ్వటం బుద్ధి తక్కువ. పోనీ దీన్ని ఎక్కడన్నా అమ్ముదామంటే రాజభటులతో చిక్కురావచ్చు. అందుచేత దీన్ని తిన్నగా తీసుకుపోయి రాజుగారికే కానుకగా ఇస్తే మంచి సత్కారం జరగవచ్చు: గంగామాత కరుణవల్ల నా దరిద్రం తీరనూవచ్చు."

ఇలా ఆలోచించి ఆ బ్రాహ్మణుడు సరాసరి కాశీరాజు ఆస్థానికి వెళ్ళి, రాజును ఆశీర్వదించి, కంకణం బహూకరించాడు.

ఆ కంకణాన్ని చూసి రాజుతోబాటు రాజసభలో వారందరూ ఆశ్చర్యపోయారు. రాజుగారి కొలువులో ఉండే రత్న నిపుణులు దాన్ని పరిశీలించి, అది దేవలోకానికి చెందినదే గాని, మానవ లోకానికి చెందినది కాదన్నారు.

ఈ మాటకు పరమానంద భరితుడై రాజు, ఆ బ్రాహ్మణుణ్ణి ఘనంగా సత్కరించటానికి నిశ్చయించుకుని, ఆ కంకణాన్ని అంతఃపురంలోని తన రాణి వద్దకు పంపాడు. ఆమె దానిని చూసి ఎంతో ముచ్చటపడి, తన కుడిచేతికి తొడుక్కుని, తిన్నగా రాజ



సభకు వచ్చి, "ఇది రాణించాలంటే దీని జత కూడా ఉండాలి. దీని జత సంపాదించండి," అని బ్రాహ్మణుణ్ణి అడిగింది.

దానితో బ్రాహ్మణుడు కొయ్యబారి పోయాడు. వ్యవహారం ఇలా పరిణమిస్తుందని ఆయన కలలో కూడా అనుకోలేదు. అందుచేత ఆయన, ఆ కంకణానికి జతను సంపాదించటం తనకు అసాధ్యమని మనవి చేసుకున్నాడు.

రాజు బ్రాహ్మణుడి మాటను తోసిపుచ్చి, "సాయంకాలం లోపల దీని జత కంకణం సంపాదించ లేకపోతే నువ్వు దీన్ని దొంగిలించి తెచ్చినట్టు భావించవలసి వస్తుంది," అన్నాడు.

బ్రాహ్మణుడి గుండె జారిపోయింది. తాను చేసినది నిజానికి దొంగతనమే. దానికి శిక్ష మరణదండన. దాని జత కంకణాన్ని సాయంకాలం లోపుగా తీసుకు రావటానికి ప్రయత్నిస్తానని మాట ఇచ్చి ఆయన రాజు గారి వద్ద సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. ఆయన పారిపోకుండా చూడమని రాజు కొందరు భటులను బ్రాహ్మణుడి వెనక పంపాడు.

బ్రాహ్మణుడు తిన్నగా రైదాసు వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, తన ప్రాణం కాపాడమని అతని కాళ్ళ మీద పడ్డాడు.

రైదాసు కళ్ళు మూసుకుని గంగను ధ్యానించి, బ్రాహ్మణుణ్ణి కాపాడమని వేడుతూ, తాను తోలుముక్కలు నానవేసే తొట్టిలో చెయ్యిపెట్టి మరొక కంకణాన్ని పైకి తీశాడు. వింత చూడటానికి అక్కడ గుమికూడిన వాళ్ళు ఈ విడ్డూరం చూసి ఆశ్చర్యపోయారు.

బ్రాహ్మణుడు రైదాసుకు కృతజ్ఞత తెలుపుకుని, ఆ కంకణం తీసుకుని రాజు గారి వద్దకుపోయి ఆ కంకణాన్ని ఆయనకు సమర్పించాడు.

తన భటులద్వారా జరిగినదంతా విన్న కాశీరాజు రైదాసుకు సుఖజీవనం ఏర్పాటు చేస్తాననీ, చెప్పులు కుట్టేపని మానమనీ అన్నాడు గాని రైదాసు అందుకు ఒప్పుకోలేదు.





# ఒకరోజు రాజు

బొగ్దాదులో, హారూనల్ రషీద్ పరిపాలించే కాలంలో, ఒక వింత బ్రహ్మచారి ఉండే వాడు. అతని పేరు అబూ అల్‌హసన్. అతను ప్రతిరోజూ సాయంకాలం వేళ నగరంలోని నది వంతెన చివర నిలబడి, నగరంలోకి కొత్తగా వచ్చేవాణ్ణి ఒకణ్ణి పట్టుకుని, తన యింట ఆతిథ్యం స్వీకరించటానికి ఆహ్వానించేవాడు. అతిథి ధనికుడు కానీ, దరిద్రుడు కానీ, ముసలివాడు కానీ, యువకుడు కానీ, అబూ అల్‌హసన్‌కు పట్టింపు లేదు; అతిథి పొరుగూరివాడూ, ఎరగనివాడూ అయి ఉండాలి. ఒక రాత్రి తన ఇంట ఆతిథ్యం పొందినవాణ్ణి అతను రెండో రోజు ఉదయమే సాగనంపేవాడు; ఒకవేళ ఆ అతిథి నగరంలో మరొకసారి కనిపించినా కూడా, అతన్ని ఎరగనట్టు ముఖం తిప్పుకుని, తన దారిన తాను వెళ్ళేవాడు. అబూ అల్‌హసన్ ప్రవర్తన అతని ఇరుగుపొరుగు వారికి చాలా వింతగానూ, విడ్డూరంగానూ తోచేది.

ఒకనాడు సూర్యాస్తమయం వేళ అబూ అల్‌హసన్ వంతెన చివర నిలబడి ఉండగా, ఒక మోసల్ వర్తకశ్రేష్ఠుడు నగరం కేసి వచ్చాడు. ఆయన వెనక ఒక దీర్ఘకాయుడైన బానిస ఉన్నాడు.

ఆ వర్తకుడు మరెవరో కాదు, మారువేషంలో నగర పరిసరాలు తణిఖీ చెయ్యటానికి వెళ్ళి తిరిగి వస్తున్న ఖలీఫాయే. అబూ అల్‌హసన్ ఆ సంగతి ఎరగడు. అతను ఆ వర్తకుడికి ఎదురు వెళ్ళి, వంగి వందనం చేస్తూ ఆయనను ఆ రాత్రి తన ఇంటికి అతిథిగా రమ్మని ఆహ్వానించాడు.

"ఈ రాత్రికి మీరు నా ఆతిథ్యం స్వీకరించినట్టయితే రేపు తాపీగా సత్రంలో బస ఏర్పాటు చేసుకో వచ్చును," అన్నాడతను ఖలీఫాతో.

ఖలీఫాకు అబూహసన్ ప్రవర్తన వింతగా తోచింది. ఇలాటివాడి పరిచయం ఒక కొత్త అనుభవంగా ఉంటుందనుకుని ఆయన ఆ యువకుడి ఆతిథ్యానికి సమ్మతించి, అతని వెంట అతని ఇంటికి వెళ్ళాడు.

హసన్ తల్లి రుచి రుచిగా వంటకాలు తయారు చేసి భోజనం వడ్డించింది. ఇద్దరూ భోజనం ముగించి, కబుర్లు చెప్పుకుంటూ తాగటానికి ఉపక్రమించారు.

ఆ సమయంలో అబూ అల్‌హసన్ తన అతిథితో, "మీరాక నా కెంతో ఆనందం కలిగిస్తున్నది," అన్నాడు.

అతని కథ ఏమిటో తెలుసుకోవాలని ఖలీఫా, "బాబూ, నువు ఎరగని వారికి ఇలా ఆతిథ్యం ఎందు కిస్తున్నావో, నీ కథ ఏమిటో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉన్నది," అన్నాడు.

అబూ అల్‌హసన్ ఇలా చెప్పాడు:

"నా పేరు అబూ అల్‌హసన్. నా తండ్రి వర్తకుడు. నాకు నగరంలో మంచి ఆస్తినే వదిలి నా తండ్రి మరణించాడు. నా తండ్రి నన్ను చిన్నతనం నుంచీ ఎంతో కట్టుదిట్టంగా పెంచటం చేత, నాకు స్వేచ్ఛగా సుఖాలలో మునిగి తేలాలని కోరికకలిగింది. అయితే నేను పొత్తిగా అవివేకిని కాను. అందుచేత నేను నా కున్నదంతా రెండు భాగాలుగా విభజించి, సగం ఆస్తిని వస్తురూపంలో భద్రపరిచి, మిగతాది డబ్బురూపంలో ఖర్చు చేస్తూ, నాతోటి స్నేహితులతో కలిసి కోటీశ్వరుడిలాగా జీవించ సాగాను. సుఖాలకోసం



ఎంత ధనమైనా ఖర్చు చెయ్యటానికి వెన కాడలేదు. సరిగా సంవత్సరం తిరిగే సరికి నా చేతిలో చిల్లిగవ్వ మిగలకుండా పోయింది. ఆ స్థితిలో నేను నా మిత్రుల సహాయం కోరాను. వాళ్ళు కానరాకుండా పోయారు. నేను వారి వెంటబడి నా దీనస్థితిని గురించి చెప్పుకున్నాను. వాళ్ళందరూ ఏవేవో సాకులు చెప్పారే తప్ప, నాకు ఒక్కరోజు తిండికి కూడా సహాయం చేయకపోయారు. నన్ను కట్టుదిట్టాలలో పెంచిన నా తండ్రి వివేకం నాకు అప్పుడు తెలిసి వచ్చింది. నేను నా ఇంటికి తిరిగి వచ్చి, ఎన్నడూ స్నేహితులతో కలిసి తిరగననీ, ఎరగని వారికి తప్ప ఆతిథ్యం ఇయ్యననీ ప్రమాణం చేశాను. దీర్ఘకాలస్నేహం కన్న క్షణికమైన స్నేహం మధురమైనదని నాకు అనుభవం ద్వారా తెలిసి వచ్చింది. ఎరగని వారితో కూడా రెండు రోజులు వరసగా స్నేహం నెరపనని ఒట్టు పెట్టుకున్నాను. అందు చేత, రేపు ఉదయం నేను మీకు వీడ్కోలు చెబితే మీరు ఆశ్చర్యపడవద్దు. మన ఈ స్నేహం ఈ రాత్రితోనే చెల్లు! తిరిగి మీరు ఏ నాడైనా వీధిలో కనిపించినా నేను మీ కేసి చూడను."

హసన్ కథ విని ఖలీఫా అతనితో, "నీ ప్రవర్తన విడ్డూరంగా ఉన్నప్పటికీ, వివేకంతో కూడి ఉన్నది. నువు దూరదృష్టితో సగం ఆస్తి భద్రపరుచుకోవటం ప్రశంస నీయం. నువు చక్కగా రోజు కొక కొత్త వ్యక్తితో ప్రసంగిస్తూ, వినుగు చెందకుండా





రోజులు గడుపుతున్నావు. అయితే, రేపు ఉదయం మనకు ఎడబాటు కలుగుతుందన్నది నన్ను బాధిస్తున్నది. నువు చేసిన ఈ అతిథి సత్కార రుణం ఉంచుకోవటం నా కిష్టంలేదు. అందుచేత నువు ఏదైనా కోరిక వెలిబుచ్చి నట్టయితే నేను దాన్ని నెరవేర్చుతానని ప్రమాణం చేస్తున్నాను. మొహమాటపడి చిన్న కోరిక కోరకు. అల్లా దయ వల్ల నేను తీర్చలేని కోరిక ఉండదు." అన్నాడు.

ఈ మాట విని అబూ అల్ హసన్ ఏ మాత్రమూ ఆశ్చర్యం ప్రకటించక, "మీరు కనబడటమే నాకు పదివేలు, అంతకు మించి నేను కోరనవసరం లేదు. మీ సదుద్దేశానికి ధన్యవాదాలు. కాని నాకు తీరదగిన కోరిక అంటూ ఏదీ లేదు. నా జీవితం నాకు తృప్తికరంగానే ఉన్నది. అందులో ఇతరులు తీర్చదగినలోటు ఏదీ లేదు." అన్నాడు.

"నాకోరిక నిరాకరిస్తే అల్లా మీద ఒట్టు! మీ హృదయంలో ఉండే ఏదో ఒక కోరిక కోరని పక్షంలో నాకు తీరని అవమానం కలుగుతుంది. అపకారాన్ని సహించవచ్చు గాని ఉపకారాన్ని సహించటం ఎంతో బాధ. ఉదారుడైనవాడు తీసుకున్న దానికి రెట్టింపు ఇవ్వాలి." అన్నాడు ఖలీఫా.

తన అతిథి పట్టుదల గ్రహించినవాడై హసన్ కొంత సేపు తల వంచుకొని ఆలోచనలో పడ్డాడు. తరవాత అతను తల ఎత్తి, "నాలో ఒక కోరిక ఉన్నమాట నిజమే గాని, అది వెర్రి కోరిక. అది బయట పెడితే నన్ను గురించి మీరు మరొకలాగా అనుకోవచ్చు." అన్నాడు.

"కోరిక ఏమిటో తెలియకుండా అది వెర్రి కోరిక అనుకోవటం ఎలా? నేను కావటానికి వర్తకున్నాగాని, నువు అనుకున్న దానికన్న నాకు ఎక్కువ శక్తే ఉన్నది. అందుచేత నీ కోరిక బయట పెట్టు." అన్నాడు ఖలీఫా.

"మీరు అడిగారు గనక చెబుతున్నానే గాని, నా కోరిక తీర్చే శక్తి ఒక్క ఖలీఫాకే

ఉన్నది. కనీసం ఒక్కరోజు పాటైనా నేను హరూనల్ రషీద్‌గారి స్థానంలో బాగ్దాదు నగరానికి ఖలీఫా కావాలన్నదే నా కోరిక." అన్నాడు హసన్.

ఖలీఫా ఒక్కక్షణం ఆలోచించి, "ఒక్క రోజు నగరానికి ఖలీఫా అయితే నువు ఏం చేదామనుకుంటున్నావు?" అని హసన్‌ను అడిగాడు.

"అయ్యా, ఈ బాగ్దాదునగరం నాలుగు పేటలుగా విభజించబడి ఉన్నది. ఒక్కొక్క పేటకూ ఒక్కొక్క ప్రధానాధికారి ఉన్నాడు. మా పేటకున్న అధికారి పరమ నీచుడూ, దుష్టుడూనూ. వాడు చేసే పాపిష్ఠి పనులకు ఇద్దరు సహాయకులున్నారు. ఒకడు పేడి మూతివాడూ, మరొకడు బట్ట తలవాడూనూ. వీళ్ళు పరువుగలవాళ్ళ రహస్యాలన్నీ రాబట్టుతారు. వాళ్ళను అపఖ్యాతి పాలు చేస్తారు. డబ్బు కోసం గడ్డి తింటారు. సాధు సజ్జనులకు మనుగడలేకుండా చేస్తున్నారు. నేను ఒక్కరోజు ఖలీఫా అయిన పక్షంలో నాకు ధనం అక్కర్లేదు, నా వారికి ధనం ఇవ్వను, కానీ మా పేటకు ఈ ముగ్గురి పీడా వదిలించి, ఆ ముగ్గురి శవాలనూ కందకం లోకి ఈడ్పిస్తాను." అన్నాడు అబూ అల్‌హసన్.

"నిజంగా నీ కోరిక ఔదార్యంతో కూడు కున్నదిగా ఉన్నది. నీ కోరిక తీరటం నువు అనుకున్నంత కష్టం కూడా కాదేమో. ఎందు కంటే, ఖలీఫా వింత అనుభవాల కోసం తహతహలాడే స్వభావం గలవాడు. ఆయనకు





నీ కోరిక తెలిసినట్టయితే ఒక పగలూ, ఒక రాత్రీ నిన్ను ఖలీఫాగా చేసినా చెయ్య వచ్చు," అన్నాడు ఖలీఫా.

అబూ అల్‌హసన్ ఈ మాటకు నవ్వి, "ఏదో మనం ఊసుపోకగా మాట్లాడు కుంటున్నాం గాని, నా కోరిక తెలిస్తే ఖలీఫా గారు నన్ను తప్పక వెర్రివాళ్ళ బంది ఖానాలో పెట్టేస్తాడు. అందుచేత ఒకవేళ దివాణంలో మీకు తెలిసిన వారెవరన్నా ఉంటే, నేను యిప్పుడు పేలిన పేలుడు గురించి మాత్రం వాళ్ళలో ఎవరికీ చెప్ప కండి," అన్నాడు.

"నేను నీ సంగతి మరెవరితోనూ చెప్ప నని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు ఖలీఫా. కాని అప్పటికే ఆయన ఈ అవకాశం వినియోగించుకుని మంచి ప్రహసనం ఆడ నిశ్చయించుకున్నాడు. ఆయన ఎన్నోసార్లు మారువేషంలో తిరిగాడు గాని, ఇలాటి మంచి అవకాశం ఆయనకు ఏనాడూ దొరకలేదు.

ఆయన హసన్ వేళ నుంచి సారాసీసా తీసుకుని, "నన్ను పొయ్యనీ," అంటూ సారాతో గ్లాసులు నింపి, హసన్ చూడ కుండా అతని గ్లాసులో మంచి ఘాటైన మత్తుమందు కలిపాడు.

హసన్ తన అతిథి అందించిన సారా తీసుకుంటూ, "ఇప్పుడే చెబుతున్నాను, తెల్లవారి మీరు వెళ్ళిపోయే సమయానికి నేను నిద్రలేవక పోవచ్చు. అందుచేత మీరు వెళ్ళిపోతూ తలుపులు మూసి వెళ్ళటం మరిచిపోకండి," అన్నాడు.

ఖలీఫా అలాగే నన్నాడు. హసన్ నిశ్చింతగా సారా తాగి, తాగుతూనే ఒళ్ళు తెలియ కుండా విరుచుకు పడిపోయాడు. అది చూసి ఖలీఫాకు నవ్వు ఆగలేదు.

ఆయన తన బానిసను పిలిచి, "ఈ మని షిని ఎత్తుకుని, నా వెంటరా," అన్నాడు. ఇద్దరూ కలిసి బయటికి వచ్చారు. "ఈ ఇంటిని బాగా గుర్తుపెట్టుకో, నేను పంపితే నువు ఇక్కడికి రావలసివస్తుంది," అన్నాడాయన తన బానిసతో.

వాళ్ళు వీధిలోకి నడిచారు, కాని తలుపులు మూయటం మరిచారు.

వాళ్ళు రాజప్రాంగణంలోకి రహస్య ద్వారం గుండా ప్రవేశించి, ఖలీఫా సొంత పడక గది చేరుకున్నారు.

"ఈ మనిషి కట్టుకున్న బట్టలన్నీ తీసేసి, నా రాత్రి దుస్తులు తొడిగి, ఇతన్ని నా పక్కమీద పడుకోబెట్టు," అని ఖలీఫా తన బానిసను ఆజ్ఞాపించాడు.

ఈ పని పూర్తికాగానే ఖలీఫా రాజభవనంలోని ముఖ్యుల నందరినీ తన గదికి పిలిపించాడు. ఆయన వజీర్లూ, ప్రతీహరులూ, కొజ్జాలూ, అంతఃపుర కాంతలూ వచ్చారు.

ఖలీఫా వారితో, "రేపు మీరంతా ఈ గదికి వచ్చి, ఈ మనిషి ఆజ్ఞలన్నిటినీ పాలించాలి. నా ఎడల ఏ విధంగా నడుచుకుంటారో ఇతని ఎడల కూడా అచ్చగా అలాగే నడుచుకోవాలి. అతనే నేను అనుకోండి. నన్ను సంబోధించినట్టే అతన్ని కూడా సంబోధించండి. అతని కోరిక ఎంత స్వల్పమైనదైనా సరే ఉపేక్షించవద్దు. దీనికి భిన్నంగా నడిచిన వారిని, నా కొడుకైనా సరే, కోట గుమ్మం వద్ద ఉరి తీయిస్తాను," అన్నాడు.

"చిత్తం, చిత్తం," అని అందరూ వెళ్ళిపోయారు. కాని వజీరు జఫర్, వేత్రహస్తుడు మస్రూర్ మాత్రం ఉండిపోయారు.

ఖలీఫా వారితో, "మీరు అందరి కన్న ముందే నిద్ర లేచి వచ్చి, ఇతని ఆజ్ఞలు తెలుసుకోండి. అతను ఏమి చెప్పినా ఆశ్చర్య పడవద్దు. అతను ఒప్పుకోక పోయినాసరే, అతను ఖలీఫాయేనన్నట్టు మీరు నటించాలి. అతను చెప్పిన వారి కందరికి దానధర్మాలు చెయ్యండి. ఖజానా ఖాళీ అయిపోయినా సంకోచించవద్దు. అతని ఆజ్ఞలను బట్టి దండనలూ, బహూకృతులూ, ఉరి శిక్షలూ, ఉద్యోగాలూ, బర్తరఫులూ అమలు చెయ్యండి. ఇదంతా నా వినోదం కోసం ఏర్పాటయినట్టు అతనికి తెలియనివ్వవద్దు. మీరు లేస్తూనే నన్ను కూడా నిద్ర లేపండి," అన్నాడు. —(ఇంకా వుంది)



# బ్రహ్మచారీ శతమర్కటః

కృష్ణానది మీద ఒక బల్లకట్టు ఉండేది. ఒకనాడు నది దాటటానికి దానిమీద ఒక చిపుళ్ళు అమ్మేమనిషి, ఒక కోతులను ఆడించేవాడూ, ఒక పాములను ఆడించేవాడూ ఎక్కారు. బల్లకట్టు బయలుదేరబోతూండగా, "అగు! అగు!" అంటూ ఒక బ్రహ్మచారి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"బ్రహ్మచారిని బల్లకట్టు ఎక్కనివ్వరాదంటారు. ఆగకు!" అని బల్లకట్టు ఎక్కిన వాళ్ళు అన్నా వినిపించుకోకుండా బల్లకట్టువాడు బ్రహ్మచారి కోసం ఆగాడు.

బల్లకట్టు నది ప్రవాహంలో ఉండగా బ్రహ్మచారి చెయ్యి ఊరుకోక చిపుళ్ళ నుంచి ఒక షల్ల తీసి, దాన్ని కోతి చెవిలో పెట్టాడు. కోతి ఎగిరి పాముల వాడి బుట్టను తన్నింది. అందులో నుంచి రెండు తాచులు కంగారుగా బయటికి వచ్చాయి. వాటిని చూసి భయపడి అడపీ, బ్రహ్మచారి ప్రవాహంలోకి దూకారు. వాళ్ళను కాపాడేసరికి బల్లకట్టు వాడి తల ప్రాణం తోకకు వచ్చింది!





# అలవాటులేని పనులు

ఒక గ్రామంలో గుర్నాథం అనే రైతు ఉండేవాడు. అతను పొలం పని చూసుకుంటూ, తీరిక వేళలలో వ్యాపారం కూడా చేసేవాడు.

గుర్నాథానికి చెంగయ్యా, పాపయ్యా అని ఇద్దరు కొడుకులు ఉండేవారు. పెద్దవాడు చెంగయ్య పొలంపనిలో తండ్రికి సహాయం చెయ్యనారంభించాడు. పాపయ్య అంగడి పనిలో ప్రవేశించాడు.

గుర్నాథం తన కొడుకు లిద్దరికీ పెళ్ళిళ్లు చేశాడు. ఒక రోజు చెంగయ్య భార్య పాపయ్య భార్యతో, "పొద్దుటి నుంచి మా ఆయన పొలంలో ఒళ్ళు హూనం చేసుకుని ఇంటి కోసం పాటుపడుతుంటే, మీ ఆయన చేసేదేమిటి? కడుపులో చల్ల కదలకుండా కొట్లో కూర్చోవటమేగా?" అన్నది.

తన భర్తను గురించి తోడికోడలు తక్కువగా మాట్లాడటం పాపయ్య భార్య సహించలేక పోయింది. ఆమె రోషంతో, "కొట్లో కూర్చుని, నీ మొగుడిలాగా చుట్టలు కాలిస్తే పని అవుతుం దనుకుంటున్నావుటే? నీ మొగుడికి లెక్కలు రావు. అందుకే కొట్టుపని చాతకాదని ఊరుకున్నాడు!" అన్నది.

ఆ రాత్రి తోడికోడళ్ళు తమ భర్తలతో ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పారు. అన్నదమ్ము లిద్దరికీ పౌరుషం వచ్చింది.

మర్నాడు ఉదయం చెంగయ్య పొలానికి బయలుదేరబోతూ పాపయ్యతో, "ఏరా, తమ్ముడూ, నిన్న మీ ఆవిడ నేను చేసేపని గురించి ఏదో అందిట. కొంచెం మందలించు." అన్నాడు.

అందుకు పాపయ్య, "అది ఏమీ అనలేదట, వదినే ఏమో అందట." అన్నాడు.

"అవును! అది మాత్రం ఏమన్నదీ? ఉన్నమాటేగా?" అన్నాడు చెంగయ్య.

ముసీర్

దాంతో మాటామాటా పెరిగి పోట్లాట కిందికి దిగింది. ఇదంతా గమనించిన గుర్నాథం, కొడుకుల నిద్దరినీ పిలిచి, "ఏమిట్రాయిదంతా?" అని అడిగాడు.

"ఏముంది, నాన్నా? వాడికేమో హాయిగా కుడిచి కూర్చుని చేసేపని అప్ప గించావు. మరి నేనేమో ఒళ్ళు హూనమయ్యే పొలంపని చెయ్యాల్సి వస్తున్నది. నేనీ పని చెయ్యలేను," అన్నాడు చెంగయ్య.

"నువ్వేమంటావురా?" అని గుర్నాథం పాపయ్య నడిగాడు.

"అన్నకు పొలం పని మహా ఉంటే ఏడాదికి నాలుగు నెలలు ఉంటుందేమో. నాకు సంవత్సరం పొడుగునా ఈ పని ఉంటుంది. నేను ఈ పని చెయ్యలేను," అన్నాడు పాపయ్య.

గుర్నాథం కొంచెంసేపు ఆలోచించి, "ఒరే, చెంగయ్యా! ఇవాళ నుంచీ నువు పొలం పని మానేసి, కొట్లో కూర్చుని వ్యాపారం చూసుకో. ఒరే, పాపయ్యా, నువు వెళ్ళి పొలం పని చూడు," అన్నాడు.

చెంగయ్య వెళ్ళి కొట్టులో కూర్చున్నాడు. కాని అతని మనసంతా పొలం మీదనే ఉన్నది. అతనికి లెక్కలు తెలియని కారణంచేత కొట్టుపని గజిబిజిగా ఉన్నది.

పొలానికి వెళ్ళిన పాపయ్య మనసు కొట్టుచుట్టూ తారట్లాడుతున్నది. అతను కాయకష్టానికి అలవాటుపడ్డవాడు కాకపోవటంచేత కొంచెం పని చేసేసరికే కళ్ళు బైర్లు కమ్మి, చతికిలపడి కూర్చున్నాడు.

పాపయ్య సాయంకాలం ఇంటికి వస్తూనే తండ్రి దగ్గిరికి వెళ్ళి, "నాన్నా, రేపటినుంచీ నేను కొట్టుపనే చూసుకుంటాను," అన్నాడు. అలాగే చంగయ్య కూడా తనకు పొలం పనే చెయ్యాలని ఉన్నట్టు తండ్రితో చెప్పేశాడు. ఆ రాత్రి వాళ్ళ భార్యలు వాళ్ళతో, "మళ్ళీ ఆ పాతపనే చేస్తామన్నారూ? ఛీ, ఛీ!" అన్నారు.

అన్నదమ్ము లిద్దరూ తమ భార్యలను నోళ్ళు ముయ్యమని గదమాయించి, మర్నాటి నుంచీ తమ తమ పాత పనులే చెయ్యసాగారు.



# బలప్రదర్శన

దొడ్డమిట్ట దగ్గిర ఒక గ్రామానికి ఒకసారి ఒక బలాఢ్యుడు వచ్చి బలప్రదర్శనలు చేశాడు. అతను రచ్చబండ వద్ద నున్న పెద్ద రాయిని ఎత్తి, గ్రామస్థులందరి మెప్పూ పొంది వెళ్ళిపోయాడు.

తరవాత కూడా గ్రామస్థులందరూ అతన్ని మెచ్చుకుంటుంటే వారిలో ఒకడు, "మీరు వాణ్ణి ఎందుకు మెచ్చుకుంటున్నారు? వాడు మాంసం తిని, పాలు తాగి బాగా బలిసి ఉన్నాడు. నాకు ఎవరన్నా ఆరు నెలల పాటు మాంసమూ, కోడిగుడ్లూ, పాలూ పెట్టినట్టయితే దొడ్డమిట్టనే మోసెయ్యగలను," అన్నాడు.

గ్రామస్థులు వాడి మాట నమ్మి, వంతులు వేసుకుని, వాణ్ణి ఆరునెలల పాటు వాడు కోరినట్టు మేపి, "ఏదీ? దొడ్డమిట్ట ఎత్తు!" అన్నారు.

"నేను దొడ్డమిట్టను ఎత్తుతాననలేదు, మోస్తానన్నాను. ఆ కొండను ఎత్తి నా భుజాల మీద పెట్టండి. మొయ్యలేకపోతే అప్పుడు అడగండి!" అన్నాడు ఆ ధూర్తుడు.






# న్యాయంకోసం

ఒక ఊళ్ళో శంకరయ్యా అనే ధనవంతుడు ఉండేవాడు. ఆయన వడ్డీవ్యాపారం చేసేవాడు. అయన పెద్ద వడ్డీలు కోరేవాడు కాడు. బంగారు నగలు తాకట్టు పెట్టినవారికే అప్పులిచ్చి, అవి తీర్చటానికి గడువు పెట్టేవాడు. గడువు తీరేలోపల బాకీ తీర్చని వాళ్ళ తాకట్టు వస్తువులన్నీ అయన భార్య వంటిమీద బంగారు తొడుగులాగా శాశ్వతంగా ఉండిపోయేవి.

ఆ ఊళ్ళోనే ఉండే ఒక సంసారి అవసరంగా డబ్బుకావలిసి, రత్నాలహారం తాకట్టుపెట్టి శంకరయ్యా వద్ద రెండువేలు అప్పు తీసుకున్నాడు. బాకీ తీర్చవలసిన గడువులోపల ఆయన చనిపోయాడు. ఆయన కొడుకు చాలావరకు బాకీ తీర్చాడు గాని గడువు రోజుకు ఇంకా రెండు మూడు వందలు వడ్డీ బాపతు మిగిలిపోయింది. గడువు దాటినాక మిగిలిన డబ్బు తెచ్చి ఆ యువకుడు హారం ఇయ్యమని శంకరయ్యాను అడిగాడు.

"గడువు దాటింది. హారం ఇవ్వను." అనేశాడు శంకరయ్యా.

రెండువేలు చేసే హారం పోతున్నందుకు ఆ యువకుడికి కడుపు మండిపోయింది. అతను గ్రామాధికారితో మొరపెట్టుకుంటే, "నేను మాత్రం ఏం చెయ్యగలను? మీ తండ్రి రాసిన పత్రం ఉన్నదాయె. శంకరయ్యా ఇంటికి కన్నం వెయ్యటం మినహాగా నీ కా హారం రాదు," అన్నాడు గ్రామాధికారి.

మాట వరసకు గ్రామాధికారి అన్న మాటలు యువకుడి బుర్రలో పనిచెయ్యసాగాయి. ఆ హారం దొంగిలించాలని అతనికి బుద్ధిపుట్టింది. అవకాశం కోసం అతను పని పెట్టుకొని ఆ ఇంటి చుట్టుపక్కల తారట్లాడేవాడు.

ఏ. సి. రాముడు

ఒకరోజు ఉదయం శంకరయ్యా బాకీలు వసూలు చేసుకు రావటానికి బస్తీకి బయలు దేరుతుండగా, ఆయన భార్యా తల వాకిలి దగ్గిరికి వచ్చి, "చూడండీ, రత్నహారంలో ఒక రాయి వదులుగా ఉంది. దాన్ని బిగించాలండీ." అన్నది.

"బస్తీకే పోతున్నాను గదా. అక్కడ కంసాలి వీరయ్యాకు చెప్పి రాయి బిగించ టానికి పంపిస్తాలే," అంటూ శంకరయ్యా వెళ్ళిపోయాడు.

ఈ సంభాషణ ఆ యువకుడి చెవిన పడింది. అతను ఇంటికి వెళ్ళి తన మిత్రుల్లో ఒకణ్ణి పిలిచి, వాడికి చెప్పవలసింది చెప్పి, రెండు గంటల అనంతరం శంకరయ్యా ఇంటికి పంపాడు.

వాడు, "అమ్మగారూ!" అని పిలవ గానే శంకరయ్యా భార్యా బయటికి వచ్చి, "ఎవరూ?" అన్నది.

"కంసాలి వీరయ్యానమ్మా! అయ్యాగారు పంపారు. హారంలో రాయి వదులయిం దిటగా? బిగించి ఇయ్యామన్నారు," అన్నాడు వచ్చినవాడు.

"నిజమే, నాయనా! హారం ఇయ్యా మన్నావా?" అని అడిగింది శంకరయ్యా భార్యా.

"ఇయ్యండి. క్షణంలో బిగించి తెస్తాను," అని ఆ మనిషి ఆ హారాన్ని తీసుకుని వెళ్ళి పోయాడు. అది అసలు వాడికి చేరింది.

ఆ సాయంకాలం భర్త ఇంటికి రాగానే శంకరయ్యా భార్యా, "భలేవాణ్ణి పంపా



రండీ! క్షణంలో తెచ్చి ఇస్తానని తీసుకుపోయి ఆ కంసాలి వీరయ్య ఇంతవరకూ రాలేదు. రత్నాలహారం పని ఎప్పటికవుతుందో ఏమో!'' అన్నది.

"రత్నాలహారమా? పని తొందరలో నే నా మాటే మరిచాను సుమా! బస్తీ నుంచి నే నెవరినీ పంపలేదే?" అన్నాడు శంకరయ్య.

భార్యా భర్త లిద్దరికీ మిన్ను విరిగి మీద పడ్డట్టయింది.

ఎవడో దొంగ వెధవ తమ సంభాషణ విని, తెలివిగా రత్నాల హారం కాజేసుకుపోయాడు!

శంకరయ్య అప్పటి కప్పుడే గ్రామాధికారి వద్దకు వెళ్ళి, దొంగతనం గురించి చెప్పి, "అయ్యా, దండోరా వేయించండి. ఆ రత్నాలహారం తిరిగి ఇచ్చిన వారికి గాని, ఇప్పించిన వారికి గాని నాలుగువందలు బహుమానం ఇస్తాను," అన్నాడు.

"ఏమండీ, శంకరయ్యగారూ? బాకీలో రెండు వందలు దిగబడిందని ఆ హారాన్ని సొంతం చేసుకున్నారు గదా? దాన్ని తెచ్చి ఇచ్చిన వాడికి నాలుగువందలు ఇస్తానని చాటింపు వేస్తే నలుగురూ మిమ్మల్ని గురించి ఏమనుకుంటారో కాస్త ఆలోచించండి. నన్నడిగితే మీరు గుట్టుచప్పుడు కాకుండా ఊరుకోవటం మంచిది. మీ బాకీ దాదాపు అంతా మీకు ముట్టనే ముట్టింది. హారం పోతే ఏడవవలిసినవాడు అసలు వాడు," అన్నాడు గ్రామాధికారి.

శంకరయ్య సిగ్గుపడి ఇంటికి తిరిగి వచ్చాడు.

తరవాత కాస్సేపటికి యువకుడు వచ్చి, "ఇదుగోనండీ. మీ మిగతా బాకీ రెండు వందలూనూ. హారాన్ని దొంగిలించిన వాడు నాకు దొరికాడు. హారం నాకు చేరింది. అది ముట్టినట్టు రసీదు రాసిస్తాను, పుచ్చుకోండి," అన్నాడు.

విధిలేక శంకరయ్య, యువకుడి బాకీ పరిష్కారమైనట్టు రాసి ఇచ్చి, హారం ముట్టినట్టు అతని నుంచి రసీదు పుచ్చుకున్నాడు.



# అలవాటు

ఒక ఊళ్ళో ఒకడికి అప్పుచేసి పప్పుకూడు తినే అలవాటు ఉండేది. ఒకసారి మోసపోయిన వాళ్ళు మోచేయి చూపించినా, కొత్తవాళ్ళు వాడి వలలో పడి అప్పులు ఇస్తూ ఉండేవాళ్ళు. వీడి వ్యవహారం బాగా మితిమీరిపోయేసరికి ఊళ్ళోవాళ్ళంతా కూడబలుక్కుని రాజుకు ఫిర్యాదు చేశారు.

రాజు వాడి సంగతంతా విని, వాడికి బుద్ధి తెప్పించాలని, "వీణ్ణి తీసుకుపోయి నడివీధిలో ఒంగోపెట్టి, వీపు మీద పెద్ద రాతిబండను పెట్టండి," అని ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞ అమలు జరిగింది.

దూర ప్రాంతంనుంచి ఒక వర్తకుడు కొన్ని ఏనుగులను వ్యాపారం నిమిత్తం తోలుకుని వస్తున్నాడు. బండ మోస్తున్న వాడు అది చూసి వర్తకుణ్ణి, "అయ్యా, ఏనుగులు అమ్మేవేనా?" అని అడిగాడు.

ఔనన్నాడు వర్తకుడు.

"అయితే అరువుగా రెండు ఏనుగులను కట్టేసి వెళ్ళు," అన్నాడు బండమోస్తున్న వాడు.

అది విని రాజు, "ఇది వాడికి దురలవాటు. ఏం చేసినా పోదు. వాణ్ణి వదిలెయ్యండి," అని భటులతో అన్నాడు.

—కె. కె. రావు





# గణపతిభట్టు

ఒక గ్రామంలో గణపతిభట్టు అనే భట్రాజు ఉండేవాడు. స్సంపన్నులను కీర్తించి, వారిచ్చే బహుమానాలతో జీవయాత్ర సాగించటం అతని కులవృత్తి. ఈ వృత్తిలో గణపతిభట్టు చాలా ప్రతిభా, సమయస్ఫూర్తీ కలవాడు; చక్కని ఆశుకవిత్వం చెప్ప గలవాడు.

ఆ గ్రామంలోనే ఒక జమీందారు ఉండేవాడు. ఆయన ఇంట ఏ శుభకార్యం జరిగినా గణపతిభట్టు హాజరై, జమీందారు మీదా, ఆయన వంశం మీదా స్తోత్రపాఠాలు చదివేవాడు.

అయితే జమీందారు గొప్ప లోభి. అందుచేత ఆయన గణపతిభట్టు చేతిలో చిల్లరడబ్బులు పెట్టి, ఎప్పుడో తన ఇంట జరగబోయే శుభకార్యానికి మంచి ఈనాము ఇస్తానని కల్లబొల్లి మాటలు చెప్పి తప్పించుకుంటూ ఉండేవాడు.

ప్రతిసారీ ఇలాగే జరుగుతూ వచ్చింది. అయినా గణపతిభట్టు జమీందారును వదిలి ఇంకొక చోటుకుపోయి, సంపాదన కోసం మరొక జమీందారును ఆశ్రయించ లేదు; ఎప్పటికైనా ఈ జమీందారు తనకు మంచి బహుమానం ఇవ్వకపోతాడా అని కని పెట్టుకుని ఉన్నాడు.

భట్టుకు ఎన్నాళ్ళనుంచో ఒక పాడిగేదెను సంపాదించుకోవాలని ఆశ ఉన్నది. అతని ఇంట్లో అందరూ పాలకూ, పెరుగుకూ మొహం వాచి ఉన్నారు. అందుచేత భట్టు, ఎలాగైనా జమీందారు నుంచి ఒక పాడిగేదెను బహుమానంగా పుచ్చుకోవాలన్న ఆశతో ఉన్నాడు.

ఇంతలో జమీందారుగారి పెద్ద కుమారుడి పెళ్ళి వచ్చింది. పెళ్ళి రంగరంగ వైభోగాలతో జరుగుతున్నది. సదస్సుకు అనేక గ్రామాల నుంచి గొప్ప గొప్ప

ఏ. చంద్రావతి

వాళ్ళంతా వచ్చారు. గణపతిభట్టు ఆ సదస్సుకు హాజరై, వధూవరులను ఆశీర్వదిస్తూ మంచి మంచి పద్యాలు కట్టి చదివి, అందులోనే జమీందారు గుణగణాలనూ, కీర్తి ప్రతిష్ఠలనూ ఆకాశానికి ఎత్తేశాడు. ఆ పద్యాలు విని సభలోవారంతా అమితంగా మెచ్చుకున్నారు.

గణపతిభట్టుకు ఏదో గట్టి బహుమానం ఇవ్వక తప్పదని జమీందారుకు తోచింది. ఆయన భట్టుతో, "నీకు ఈనాం ఇవ్వదలిచాను. ఏ రూపంలో ఇవ్వమన్నావు?" అన్నాడు.

"మహాప్రభో, నాకు ఒక పాడిగేదెను ఈనాముగా దయచేయించండి." అన్నాడు గణపతిభట్టు.

"అలాగే," అని జమీందారు తన నౌకర్లలో ఒకణ్ణి పిలిచి వాడితో రహస్యంగా ఏదో చెప్పాడు. సేవకుడు వెళ్ళి కొద్దిసేపటికల్లా ఒక గేదెను తెచ్చి కొంచెం దూరాన నిలబెట్టాడు.

ఆ గేదెను చూడగానే గణపతిభట్టుకు నిరాశ కలిగింది. అది చాలా ముసలిగేదె. అది కట్టినా కట్టదు, పాలు ఇవ్వదు. పట్టి తిండి దండుగ గేదె!

కాని అది తనకు పనికి రాదని గణపతి భట్టు అంతమంది మధ్య జమీందారుతో ఎలా అంటాడు? దాన్ని పుచ్చుకోవటమేమో అతనికి ఎంత మాత్రమూ ఇష్టం లేదు. దాన్ని తీసుకోకుండా ఉండటానికి అతను ఒక మంచి ఆలోచన చేశాడు. అతను గేదె



దగ్గిరికి వెళ్ళి దాని చెవిలో ఏదో చెబుతున్నట్టు నటించి, అది చెప్పేది వింటున్నట్టు చిన్నగా తలాడిస్తూ, దాని నోటిదగ్గిర తన చెవి పెట్టాడు.

భట్టు చేసేపని చూసి సభలో వారంతా నివ్వెరపోయారు.

"భట్టూ, ఏమిటి నువు చేస్తేది ?" అని జమీందారు అడిగాడు.

గణపతిభట్టు వినయంగా చేతులు కట్టుకుని జమీందారు ఎదట నిలబడి, "మహాప్రభో, గేదెను ఒక ప్రశ్న అడిగాను. అది సమాధానం చెప్పింది," అన్నాడు.

"అలాగా! నువ్వేమి అడిగావు, అది ఏం చెప్పింది?" అని జమీందారు ఆశ్చర్యంగా భట్టును అడిగాడు.

"'నువు ఈన మొయ్యగలవా?' అని గేదెను అడిగాను. దానికి గేదె, 'కృతయుగంలో నేను మహిషాసురుడి భార్యను. ఆదిశక్తి నా భర్తను హతమార్చింది. నేను మాత్రం ఛావలేదు. తరవాత త్రేతాయుగం వచ్చింది. మనుషులు మారిపోయారు. పశుపక్ష్యాదులు మారిపోయాయి. నేను మాత్రం మారలేదు. రావణుడు పుట్టటమూ, చావటమూ కళ్ళారా చూశాను. నాకు విరక్తి కలిగింది. తరవాత ద్వాపరయుగం వచ్చింది. అప్పుడు కూడా నేను ఈ రూపంలోనే ఉన్నాను. కంసుడు పుట్టటమూ, చావటమూ కళ్ళారా చూశాను. నాకు ప్రపంచం మీదనే రోత పుట్టింది. కలియుగం వచ్చింది. నేను అన్ని బంధాలూ వదులుకుని, ముక్కు మూసుకుని ఉన్నాను. ఈ వయసులో నన్ను నువు, ఈన మొయ్యగలవా, అని అడగటానికి నీకు సిగ్గులేదా?' అని సమాధానం చెప్పింది, మహాప్రభో!" అన్నాడు గణపతిభట్టు.

అందరూ అతని మాటలకు గొల్లున నవ్వారు. జమీందారు దానం ఇచ్చిన గేదె ఎలాటిదో అందరికీ తెలిసిపోయింది. జమీందారు తన పరువుపోతున్నదని తెలుసుకుని, ఆ గేదెను తెచ్చిన నౌకరును గట్టిగా చివాట్లు వేసి, మంచి పాడిగేదెను తెప్పించి గణపతిభట్టుకు ఇచ్చాడు.





# మహాభారతం

సభలో భీష్ముడూ, కృపాచార్యుడూ దుర్యోధనుడికి హితబోధ చేసిన మీదట త్రిగర్త రాజూ, రథబలాలకు నాయకుడూ అయిన సుశర్మ చప్పున లేచి దుర్యోధనుడితో ఇలా అన్నాడు:

"మత్స్యదేశపు రాజు నా దేశాన్ని చాలా సార్లు చీకాకు పరచాడు. అమిత బలవంతుడైన అతని సేనానాయకుడు గంధర్వుల చేతిలో చచ్చాడు. ఇప్పుడు మత్స్యదేశానికి నాథుడు లేడు. మీరు కోరినట్టయితే ఆ దేశం మీద యుద్ధానికి పోదాం. కౌరవులూ, త్రిగర్తులూ కలిసి వెళ్ళినట్టయితే మత్స్యదేశం లొంగిపోతుంది. కావలిసినంత ధనమూ, రత్నాలూ, అంతులేని ఆవుల మందలూ కొల్లగొట్ట వచ్చు. వాటితో నీ బలం వృద్ధి అవుతుంది. నా దేశానికి శత్రుబాధపోతుంది."

సుశర్మ చెప్పిన ఆలోచనను కర్ణుడు బలపరిచాడు.

దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనుడితో, "సైన్యాన్ని సిద్ధం చెయ్యి. సుశర్మ త్రిగర్తసేనలతో ఒక పక్క నుంచి మత్స్యదేశం మీద దాడి చేసి ఆవుల మందలను పట్టుకుంటాడు. మర్నాడు మనం మరొక పక్క నుంచి దాడి చేద్దాం," అన్నాడు.

ఈ పథకం ప్రకారం కృష్ణసప్తమినాడు సుశర్మ తన బలాలతో మత్స్యదేశం మీదికి దండయాత్ర బయలుదేరాడు. అష్టమినాడు కౌరవసేనలు కదిలాయి.

41. గోగ్రహణం



ఈ లోపల విరాటనగరంలో రహస్యంగా జీవిస్తున్న పాండవుల గడువు పూర్తి అయింది. కీచకుడు చచ్చినాక విరాటుడు కుక్కిన పేనులాగా ఉన్నాడు.

ఇంతలో సుశర్మ సేనలు విరాటుడి గోవుల మందలను చుట్టుముట్టి పట్టుకున్నాయి. త్రిగర్తులు వచ్చి లక్షల సంఖ్యలో గోవులను వశపరచుకున్నారనీ, వారిని ఎదిరించి గోవుల మందలను కాపాడుకోవలసిందనీ గోపాలకుల నుంచి విరాటుడికి వార్త వచ్చింది.

వెంటనే విరాటుడు తన సైన్యాన్ని ఆయత్తపరచి, తన తమ్ములైన శతానీకుడూ, మదిరాక్షుడూ మొదలైన వీరులతో యుద్ధ సన్నద్ధుడైనాడు. తన వద్ద ఉన్న పాండవులలో ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ యుద్ధం చెయ్యగలిగే ఉంటారనుకుని విరాటుడు వారికోసం కూడా నాలుగు రథాలు సిద్ధం చేయించాడు.

విరాటుడి సేనలు త్రిగర్త సైన్యాన్ని కలుసుకునే సరికి చాలా పొద్దెక్కింది. ఇరు పక్షాలకూ మధ్య తీవ్రమైన యుద్ధం జరుగుతూండగా చీకటి పడింది. ఆ సమయంలో సుశర్మ విరాటుడితో యుద్ధం చేసి, ఆయనను ప్రాణాలతో పట్టుకున్నాడు. విరాటుడి సేన చీకాకు పడిపోయింది.

అప్పుడు ధర్మరాజు భీముణ్ణి యుద్ధానికి వెళ్ళి విరాటరాజును విడిపించుకు రమ్మనీ, యుద్ధం చేసే పద్ధతిలో భీముడన్న సంగతి బయట పడకుండా జాగ్రత్త పడమనీ హెచ్చరించాడు. భీముడు సుశర్మను ఎదిరించి యుద్ధం చేసి, అతన్ని చితకపొడిచి, బంధించి పట్టుకుని, విరాటుణ్ణి విడిపించాడు. భీముడు పట్టితెచ్చిన సుశర్మను ధర్మరాజు విడిపించాడు.

తాను గెలిచినట్టు విరాటనగరానికి వార్త పంపి, విరాటుడు తన గోవుల మందలను మళ్ళించుకుంటూ ఉన్న సమయంలో దుర్యోధనుడు బ్రహ్మాండమైన సేనతోనూ, భీష్మ, ద్రోణ, కర్ణ, శకుని, దుశ్శాసన, అశ్వత్థామ మొదలైన మహావీరులతోనూ




మరొక పక్కనుంచి మత్స్యదేశంలోకి జొర బడి అక్కడి గోవుల మందలను పట్టాడు.

గోపాలకుల పెద్ద ఈ వార్త తెలపటానికి రథం మీద అతి వేగంగా విరాటనగరానికి వెళ్ళి, భూమింజయు డనే రాజకుమారుణ్ణి చూసి, "రాజకుమారా, కౌరవులు మన అరువేల గోవులను పట్టుకున్నారు. నువు మహా వీరుడవని రాజుగారు చెబుతూంటారు. మన గోవులను వచ్చి విడిపించు. కౌరవ సేనను చించిచెండాడు," అని అన్నాడు.

ఉత్తరుడు అని ప్రసిద్ధి కెక్కిన భూమింజయుడు ఈ వార్త వినేటప్పుడు స్త్రీల మధ్య కూర్చుని ఉన్నాడు. అందుచేత అతను తాను నిజంగా మహాయోధుడిగానే అనుకుని, "మన అవులను అవలీలగా మరల్చగలను గాని, నాకు యుద్ధమర్మం తెలిసిన సారథి లేకపోవటం ఎంతో • విచారంగా ఉన్నది. మంచి సారథిని చూడండి," అన్నాడు.

ఉత్తరుడి వద్ద ఉన్న స్త్రీలతోబాటు బృహన్నల రూపంలో అర్జునుడు కూడా అక్కడే ఉన్నాడు. అతను తమ అజ్ఞాత వాసం పూర్తి అయినట్టు లెక్క చూసుకుని, రహస్యంగా ద్రౌపదితో, "నేను ఒకప్పుడు అర్జునుడికి సారథిగా ఉండి, అతని మెప్పు పొందిన వాడినని ఉత్తరుడికి చెప్పు. నన్ను సారథిగా పెట్టుకోమను," అన్నాడు.

ద్రౌపది కొంచెం సిగ్గుపడుతూ ఉత్తరుణ్ణి సమీపించి, అర్జునుడు చెప్పమన్నమాట చెప్పింది. బృహన్నల నపుంసకుడని సందేహిస్తూ, ద్రౌపది గెలుస్తావని గట్టిగా చెప్పిన మీదట ఉత్తరుడు సరేనన్నాడు. అతను కోరిన మీదటఅతని చెల్లెలు ఉత్తర బృహన్నలను సమీపించి, తన అన్నకు సారథిగా పని చెయ్యమని కోరింది.

ఉత్తరుడు కౌరవ యోధులతో యుద్ధం చెయ్యటానికీ, అర్జునుడు అతనికి సారథ్యం చెయ్యటానికీ సిద్ధమయారు. ఉత్తరా, ఆమె తోటి ఆడపిల్లలూ బృహన్నలతో, "మీరు భీష్మ ద్రోణులను జయించి, మా బొమ్మలకు రంగు రంగుల బట్టలు, మెత్తనివి తీసుకురండి," అని కోరారు.

అర్జునుడు నవ్వి, "ఉత్తరుడు గెలిస్తే అలాగే తెస్తాను," అన్నాడు.

రథం నగరం దాటింది. ఉత్తరుడు అర్జునుడితో, "బృహన్నలా, రథాన్ని కౌరవ సేన ఉండే దిక్కుగా తోలు. మనం ఆ సేనను జయించి, ఆవులను మళ్ళించుకుని త్వరగా తిరిగి రావాలి," అన్నాడు.

అర్జునుడు రథాన్ని వేగంగా నడిపాడు. వాళ్ళు శ్మశానం మధ్య ఉన్న శమీవృక్షాన్ని చేరేసరికి దూరాన కౌరవ సేన మహా సముద్రంలాగా కనిపించింది. ఆ సేనలు రేపిన దుమ్ము ఆకాశంలోకి చాలా ఎత్తు లేస్తున్నది.

ఆ దృశ్యం చూసి ఉత్తరుడు బెదిరిపోయాడు.

"అమ్మో, ఈ సేనను నేనెట్లా గెలుస్తాను? దేవతలు కూడా గెలవలేరు. మా నాన్న సైన్యంతో సహా త్రిగర్తుల మీదికి వెళ్ళటం చేత నేను పురంలో ఒంటిగా దిగబడిపోయాను. నేను భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, ఇంకా అనేక మంది యోధులనూ ఒంటరిగా ఎదిరించగలనా? బృహన్నలా, రథాన్ని వెనక్కు తిప్పు," అని ఉత్తరుడు విలవిలలాడాడు.

"నాయనా, భయపడకు. నిన్ను చూసి శత్రువులు నవ్వుతారు. వాళ్ళతో యుద్ధం చెయ్యి. గెలిచి వస్తానని ఆడవాళ్ళ ముందు



ప్రజ్ఞలు పలికావు. నేను రథాన్ని శత్రువుల మీదికే పోనిస్తాను. ఏ విధంగానైనాసరే వాళ్ళను జయించకుండా తిరిగిపోను," అన్నాడు అర్జునుడు.

"కౌరవులు మా గోవులను ఎత్తుకుపోనీ, మా అంతఃపుర స్త్రీలు నన్ను చూసి నవ్వనీ! నేను మాత్రం యుద్ధం చెయ్యలేను," అంటూ ఉత్తరుడు రథం మీది నుంచి కిందికి దూకి, విల్లూ బాణాలూ పారేసి, నగరం కేసి పరిగెత్తసాగాడు.

"యుద్ధంలో చావనైనా చావాలిగాని, వెన్ను చూపి పారిపోవటమా?" అంటూ అర్జునుడు రథం దిగి, ఉత్తరుడి వెంట పడ్డాడు. అతని బృహన్నల ఆకారం చూసి,



అర్జునుడని తెలుసుకో లేక కౌరవ సేనల వాళ్ళు విరగబడి నవ్వారు.

ఈ లోపల అర్జునుడు ఉత్తరుణ్ణి జుట్టు పట్టుకుని ఆపి, తనను పోనివ్వమని రక రకాలుగా వేడుకుంటున్న ఉత్తరుణ్ణి రథం దగ్గిరికి లాక్కొచ్చి, "నేను యుద్ధం చేసి గోవులను విడిపిస్తాను, నువు రథం నడుపు," అంటూ అతన్ని రథం ఎక్కించాడు.

రథం శమీవృక్షానికి సమీపంగా వచ్చినాక అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, మన వద్ద ఉన్న ఆయుధాలు ఎందుకూ పనికి రావు. నువు ఈ చెట్టు ఎక్కు. దీనిమీద పాండవులు తమ ఆయుధాలు దాచారు. అందులో అర్జునుడి గాండీవం కూడా ఉన్నది. పై కప్పు విప్పావంటే నీకు ఆయుధాలన్నీ కనిపిస్తాయి," అన్నాడు.

ఉత్తరుడు చెట్టు ఎక్కి, అస్త్రాలను విప్ప దీసి, వాటిని చూసి ఆశ్చర్యపడుతూ, "మాయ జూదంలో రాజ్యం పోగొట్టుకున్న పాండవులూ, ద్రౌపదీ ఏమయారో తెలియదు గద!" అని విచారంగా అన్నాడు.

"నేనే అర్జునుణ్ణి. మీ తండ్రి కొలువులో ఉండే కంకుడు ధర్మరాజు. మీ వంటల వాడైన వల్లవుడే భీముడు. గుర్రాలను చూసేవాడు నకులుడు. గోవులను పాలించే వాడు సహదేవుడు. కీచకుల చావుకు కారణ భూతురాలైన సైరంధ్రి ద్రౌపది," అని అర్జునుడు అన్నాడు.

ఉత్తరుడు మొదట అర్జునుడి మాటలు నమ్మలేక పోయాడు. తనకు ఏమేమి పేర్లున్నాయో, అవి ఎలా వచ్చాయో అర్జు నుడు వివరించి చెప్పిన మీదట ఉత్తరుడు అతని కాళ్ళ మీద పడి, "నీ పరిచయం కలగటం నా మహాభాగ్యం. నేను తెలియక ఏమేమో వాగి ఉంటాను, క్షమించు. నా భయం పోయింది. నువు ఏ సేన కేసి రథం తోలమన్నా తోలుతాను," అన్నాడు.

అర్జునుడు ఉత్తరుడి చేత ఆయుధాలను రథంలో పెట్టించి, "నీ శత్రువులను నేనెలా నాశనం చేస్తానో చూడు," అంటూ గాండీ వాన్ని మాత్రం తాను తీసుకున్నాడు. తర



వాత అతను తన చేతి కంకణాలు తీసేసి, జుట్టు ముడి వేసుకుని, తూర్పుగా తిరిగి అస్త్రాలను ధ్యానించాడు. అతను గాండీ వానికి తాడు తగిలించి మీటే సరికి మహా ధ్వని పుట్టింది. అర్జునుడు శంఖం పూరించే సరికి ఉత్తరుడే భయపడ్డాడు. అలాటి నాదం అతను ఎన్నడూ వినలేదు.

అర్జునుడి రథం తమకేసి వస్తుంటే చూసి ద్రోణాచార్యుడు దుర్యోధనుడితో, "ఆ వచ్చేవాడు నిశ్చయంగా అర్జునుడు," అన్నాడు.

ఆ మాట విని దుర్యోధనుడు, "అజ్ఞాత వాస సంవత్సరం పూర్తి కాకముందే అర్జునుడు బయటపడ్డాడు. తిరిగి పాండవులు పన్నెండేళ్ళు వనవాసం చెయ్యాలి. గడువు తీరలేదని వాళ్ళు ఎరగకపోయి ఉండాలి. లేదా, మనం పొరపాటు పడి ఉండాలి. సరి అయిన లెక్క తేల్చవలిసినవాడు భీష్ముడే. నిన్న సాయంకాలం త్రిగర్తులు దక్షిణాన మత్స్యగోగణాలను పట్టి ఉంటారు. ఇవాళ ఉదయం మనం ఉత్తరాన గోవులను పట్టాం. గోవులను విడిపించటానికి అర్జునుడు వస్తున్నాడు. మత్స్యసేన ఇతని వెనక వస్తున్నదేమో తెలియదు. అర్జునుడితో యుద్ధం చేద్దాం," అన్నాడు.

"గడువు తీరకపోతే అర్జునుడు ఇలా బయట పడడు. అతను గోవులను విడిపించుకోకుండా తిరిగిపోడు గనక యుద్ధం తప్పదు," అన్నాడు ద్రోణుడు.

భీష్ముడు దుర్యోధనుడితో, "ప్రతి అయి దేళ్ళకూ రెండేసి అధిక మాసాలు వస్తాయి. పాండవులు వనవాసం కిందా, అజ్ఞాతవాసం కిందా గడిపిన పదమూడేళ్ళలోనూ అయిదు నెలల పన్నెండు రోజులు అధికంగా వచ్చాయి. ఆ లెక్క ప్రకారం పాండవుల అజ్ఞాతవాసం గడువు తీరిపోయింది. అది తెలిసే అర్జునుడు వస్తున్నాడు. యుద్ధంలో జయాపజయాలు నిర్ణయించటం సాధ్యం కాదు. అందుచేత న్యాయంగా పాండవులకు రాజ్యం ఇస్తావో, యుద్ధం చేస్తావో తేల్చుకో," అన్నాడు.

"నేను పాండవులకు రాజ్యం ఇవ్వను. యుద్ధానికి సిద్ధం కండి," అన్నాడు దుర్యోధనుడు.

"అలా అయితే, నువు మన సేనలో నాలుగోవంతు వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరు. మరొక నాలుగోవంతు సేన గోగణాలను వెంట బెట్టుకుని నీ వెనకనే వస్తుంది. మిగిలిన సగం సేనతో నేనూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, కృపుడూ అర్జునుణ్ణి ఎదిరించి యుద్ధం చేస్తాం," అన్నాడు భీష్ముడు.

అందరికీ ఈ పద్ధతి నచ్చింది. దుర్యోధనుడు కూడా అలా చేయటానికి సమ్మతించాడు. భీష్ముడు సేనను వ్యూహపరచి, ఏ పక్కన ఏ యోధుడు నిలబడాలో నిర్ణయించాడు.

వ్యూహంలో నిలబడిన కౌరవసేన కేసి అర్జునుడి రథం వచ్చింది. ఇప్పుడు అర్జునుడు గుర్తించటానికి వీలుగా కనిపించాడు. అతను ఉత్తరుడితో, "బాణం వేటు దూరంలో రథాన్ని నిలుపు. దుర్మార్గుడైన దుర్యోధనుడు ఎక్కడ ఉన్నదీ చూస్తాను. మిగిలిన వాళ్ళను వదిలేసి అతన్ని జయిస్తాను. ఆ తరవాత వీరందరూ ఓడినవాళ్లే," అన్నాడు.

అతను ఉత్తరుడికి ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ, కృపాచార్యుణ్ణీ, కర్ణుణ్ణీ చూపాడు. కాని దుర్యోధనుడు కనిపించలేదు.

"దుర్యోధనుడు ప్రాణాలు దక్కించుకుని, గోవులతో సహా దక్షిణ మార్గాన హస్తినాపురానికి బయలుదేరాడల్లే ఉంది. ఉత్తరుడా, ఈ సేనను వదిలేసి, రథాన్ని దుర్యోధనుడు వెళ్ళే వైపుగా నడిపించు. అతన్ని ఎదిరించి గోవులను మరలిస్తాను," అన్నాడు అర్జునుడు.

అర్జునుడు తమ నందరినీ విడిచిపెట్టి మరొక దిక్కుగా ఎందుకు పోతున్నాడో గ్రహించి కృపాచార్యుడు, "అర్జునుడు దుర్యోధనుడి మీదికి పోతున్నాడు. అర్జునుడి ముందు దుర్యోధనుడు నిలవలేడు. అందుచేత మనం దుర్యోధనుడికి అండగా వెళ్ళి నిలబడదాం," అన్నాడు.







# శివపురాణం

## 18

పూర్వం సాలంకాయను డనే మునికి శిలాదు డనే కొడుకు ఉండేవాడు. శిలాదుడికి సంతానం లేకపోగా, ఆయన కైలాసానికి వెళ్ళి, పార్వతీపరమేశ్వరులను గురించి ఘోరతపస్సు చేశాడు. పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై, శిలాదుడి కోరిక విని విచారించి, "నీకు సంతాన ప్రాప్తి లేదు. అయినా ఒక కుమారుడు లభిస్తాడు," అని చెప్పారు.

శిలాదుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. ఎంత కాలానాకీ కొడుకు కలగక పోయేసరికి ఆయన యజ్ఞం చేయ తల పెట్టాడు.

యజ్ఞగుండం తవ్వుతూ ఉండగా అందులో ఒక అందమైన బాలుడు దొరి కాడు. శిలాదుడు ఆ కుమారుడికి నందుడు అని పేరు పెట్టి పెంచసాగాడు.

ఒకసారి మిత్రావరుణులు అనే మునులు శిలాదుడి ఆశ్రమానికి వచ్చి, నందుణ్ణి చూసి, ఆ కుర్రవాడు అల్పాయువని చెప్పి, శిలాదుడికి విచారం కలిగించారు.

నందుడు తండ్రి విచారానికి కారణం తెలుసుకుని, కేదారానికి వెళ్ళి, పార్వతీ పరమేశ్వరులను గురించి తపస్సు చేశాడు. చాలాకాలానికి పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై, నందుణ్ణి వరం కోరుకోమన్నారు.

"దీర్ఘాయువు గలిగి, నేను మీ సేవలు చేస్తూ, లోక ప్రసిద్ధుడుగా పూజించబడే టట్టు అనుగ్రహించండి," అని నందుడు వేడుకున్నాడు.

పార్వతీపరమేశ్వరులు అతనికి కోరిన వరం ఇస్తూ, అతనికి నందీశ్వరుడు అని పేరు పెట్టి, గణాధిపత్యం ఇచ్చారు. శివుడు నందుణ్ణి అభిషేకించటానికి తన జటాజూటం

అట్ట చివరి బొమ్మ

నుంచి గంగను ఉపయోగించాడు. ఆ అభి షేక జలం అయిదు నదులై, త్రిస్రోత, జటోదక, స్వర్ణోదక, జంబూ, వృషధ్వజ అనే పేర్లతో ప్రవహించింది.

ఇలా అభిషేకించిన నందీశ్వరుణ్ణి పార్వతీ పరమేశ్వరులు తమ వెంట కైలాసానికి తీసుకు వెళ్ళారు. తరవాత నందీశ్వరుడు మరుత్తుల కుమార్తె అయిన సుకీర్తిని పెళ్ళా డాడు. నందీశ్వరుడి తల్లిదండ్రుల పక్షాల వారంతా శివుడి ఆజ్ఞప్రకారం రుద్రగణా లలో చేరిపోయారు.

సృష్టికి ఆదికాలంలో త్రిమూర్తులు పుట్టారు. అప్పుడు బ్రహ్మ, విష్ణు మహేశ్వరు లతో, "నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. మీరు నన్ను సేవించండి," అన్నాడు.

ఈ మాట విని ఈశ్వరుడు రౌద్రాకారం ధరించి హుంకరించే సరికి, ఒక భయంక రాకారుడు, మూడు కళ్ళు గలిగి, తెల్లని శరీరంతో, త్రిశూలం మొదలైన ఆయుధాలు ధరించి, దిక్కులు దద్దరిల్లేటట్టు ఢమరుకం మోగిస్తూ పుట్టుకు వచ్చి, "పరమేశ్వరా, నన్ను ఎందుకు పుట్టించావు?" అని అడిగాడు.

"ఈ బ్రహ్మను శిక్షించు," అన్నాడు ఈశ్వరుడు.

అప్పుడా రాక్షసాకారం బ్రహ్మకు గల అయిదు తలలలో నడిమి తలను తన చిటికెన వేలి గోరుతో ఖండించి, విసిరి వేసింది. ఆ తల పడిన చోటు బ్రహ్మకపాలం. బ్రహ్మ తలను ఖండించిన చోటు కాశీ.



బ్రహ్మను శిక్షించేందుకు ఈశ్వరుడు తాను సృష్టించిన రాక్షసాకారానికి కాలభైరవుడని పేరు పెట్టి, తన అంగరక్షకుడుగా నియమించాడు.

అయితే బ్రహ్మహత్యాపాతకం భయంకర రూపంతో కాలభైరవుడి వెంట పడింది. అది చూసి ఈశ్వరుడు, "కాలభైరవా, నువు ఈ బ్రహ్మహత్యను వదిలించుకోవటానికి తీర్థయాత్రలు చేసి, కాశీక్షేత్రానికి వెళ్ళు. అక్కడ నీకు బ్రహ్మహత్యాపాతకం నుంచి విముక్తి కలుగుతుంది," అని కాలభైరవుడితో చెప్పాడు.

అలాగే కాలభైరవుడు తీర్థయాత్రలు చాలా కాలం చేసి, కాశీక్షేత్రానికి చేరి, గంగా స్నానం చేసి, పవిత్రుడై, కాశీలోనే ఉండి, కాశీనగరానికి క్షేత్రపాలకుడై పూజించబడుతూ వచ్చాడు.

పూర్వం వ్యాఘ్రపాదు డనే ముని ఉండేవాడు. అయన భార్య విమల. వారిద్దరూ శివ భక్తులు. వారు శివుణ్ణి ఆరాధించగా, ఈశ్వరానుగ్రహం వల్ల వారికి ఒక కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడికి వారు ఉపమన్యువు అని పేరు పెట్టుకున్నారు.

విమల పుట్టింటి వారు విమలనూ, ఉపమన్యువునూ తమ ఇంటికి తీసుకుపోయి కొంతకాలం ఉంచుకుని, తరవాత వ్యాఘ్రపాదుడి వద్దకు పంపేశారు.

అయిదేళ్ళ వయసువాడైన ఉపమన్యువు ఒకనాడు తల్లితో, "అమ్మా, నాకు పాలు కావాలి," అన్నాడు.



"మనం దరిద్రులం, నాయనా. నీ మేన మామలు ధనవంతులు గనక వాళ్ళు నీకు పాలూ, పెరుగూ పెట్టారు. మనకు పాలు లేవు." అని విమల కొడుకుతో అన్నది.

ఆమె సత్తుపిండి నీటిలో కలిపి ఇస్తే ఉపమన్యువు తాగక, గుక్కపట్టి ఏడవ నారంభించాడు.

"మనం దరిద్రులమని చెప్పినా విని పించుకోక ఏడుస్తున్నావు. నేను ఏం చేసే దిరా?" అన్నది తల్లి.

"మన దరిద్రం తీరే మార్గం ఏమిటి?" అని ఉపమన్యువు తల్లిని అడిగాడు.

విమల తన కొడుకును వ్యాఘ్రపాదుడి వద్దకు తీసుకు పోయి జరిగిన దంతా చెప్పింది.

వ్యాఘ్రపాదుడు ఉపమన్యువుకు శివ పంచాక్షరీ మంత్రం చెప్పి, "బాబూ, నువు కైలాస పర్వతానికి వెళ్ళి ఈ మంత్రం జపించావంటే పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై నీకు కోరిన వరం ఇస్తారు," అని చెప్పాడు.

ఉపమన్యువు కైలాస పర్వతానికి వెళ్ళి శివపంచాక్షరి జపిస్తూ కూర్చున్నాడు.

శివుడు వికార రూపంలో ఉపమన్యువు దగ్గిరికి వచ్చి, "ఈ అరణ్యంలో ఎందుకు ఒంటరిగా ఉన్నావు? క్రూర జంతువులు బాధిస్తాయి. ఇంటికి వెళ్ళు," అన్నాడు.

"నేను నీ సలహా అడగలేదు. నాకు పార్వతీ పరమేశ్వరుల రక్ష ఉన్నది," అని ఉపమన్యువు కళ్ళు మూసుకున్నాడు.

మరు క్షణం పులి అరుస్తూ తన మీదికి వస్తున్నట్టు ధ్వని వినిపించింది, కాని ఉపమన్యువు కళ్ళు తెరవలేదు.

పార్వతీపరమేశ్వరులు కుర్రవాడి ధైర్య సాహసాలకు మెచ్చి, అతని ఎదట ప్రత్యక్షమై, వరాలు కోరుకోమన్నారు.

శివుడు పార్థివలింగ రూపంలో రోజూ తన పూజలు పొందేటట్టూ, తనకు అష్ట ఐశ్వర్యాలూ సిద్ధించేటట్టూ ఉపమన్యువు కోరాడు. పార్వతీపరమేశ్వరులు అతను కోరిన వరాలు ఇచ్చారు. ఉపమన్యువు ఇంటికి తిరిగి వచ్చి, సుఖంగా ఉన్నాడు.



# 128. హిమవిచ్ఛేదనౌక "లెనిన్"

సోవియెట్ హిమవిచ్ఛేదనౌకలకు పతాకనౌక అయిన "లెనిన్" అణుశక్తితో నడుస్తుంది. ఉత్తర ధ్రువ ప్రాంతపు దీర్ఘరాత్రి ఆరు మాసాలకాలమూ ఇది మంచు మధ్యగా దారి చేస్తూ ముందుపోతూ ఉంటే దీని వెనుకగా వస్తువాహకనౌకలు ధ్రువప్రాంత సముద్రాలలో తిరుగుతాయి. ఉత్తర, దక్షిణ ధ్రువ పరిశోధనా సంస్థల ప్రతినిధులు దీనిలో ఉంటారు. దీనిలో పనిచేసే నావికులకు సమస్త సౌకర్యాలూ ఉంటాయి. వారు విశ్రాంతి సమయాలలో సినిమాలు చూడవచ్చు, సంగీతం వినవచ్చు, వ్యాయామాలు చేయవచ్చు, లేదా పుస్తకాలు చదవవచ్చు. వారు తమ కుటుంబాలతోనూ, బంధువులతోనూ రేడియో ద్వారా ప్రసంగించే అవకాశం కూడా ఉన్నది.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

పరాక్రమం లేని రాజు.

పంపినవారు :
యడవల్లి వెంకటసుబ్బయ్య

Photo by Prabhakar Mahadik



నూజివీడు,
(కృష్ణాజిల్లా)

విక్రయం లేని రోజు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఆగస్టు నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వ్యాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్టు:

దుర్గాపూజ

మూడవ అట్టు:

ఒక భక్తుడు

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఆత్మరక్షణలో తొలిపాఠం

నాన్నా, ఇవ్వాళ నన్ను సుధీర్ కొట్టాడు.

తిరిగి ఎందుకు కొట్టలేదు? ఆత్మరక్షణ నీవు నేర్చుకోవాలి.

దెబ్బను తప్పించుకోవాలంటే వెనక్కు గాని తగ్గాలి లేదా పక్కకు తప్పుకోవాలి లేకపోతే నడుం నుంచి వెనక్కు వంగాలి.

లేకపోతే మణికట్టుతో దెబ్బ తప్పించుకోవచ్చు.

లేకపోతే దెబ్బను చేతిమీద కానీ భుజంమీద కానీ పడనీయొచ్చు.

ఇవ్వాళ్టికి చాలు — ఆత్మరక్షణ కోసం — బాక్సింగ్‌లో ఇది తొలి పాఠం.

అరె చాలా ఆలస్యం అయిపోయింది! నిద్రపో రోహిత్. అయితే పళ్ళు తోముకున్నావా?

నాన్నా, ప్రతి ఉదయం ముందు పళ్ళు తోముకుంటాను.

లేదు అబ్బాయి, దంతక్షయ కారకమైన ఆహార అణువులన్నిటిని తొలగించివేయుటకు నీవు నీ పళ్ళను ప్రతి రాత్రీ ప్రతి ఉదయం తోముకోవాలి. నీవు చిగుళ్ళను కూడా రుద్దుకోవాలి.

మనమిద్దరం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో మన పళ్ళను తోముకుందాం, రా.

అలాగే నాన్నా.

Forhan's
FOR THE GUMS

ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే
సృష్టించబడిన
టూత్‌పేస్టు

స్కూలు పిల్లలకు తగిన బాటా బూట్లు

పిల్లల స్కూలు జోళ్లు నడవడానికి సదుపాయంగా బాటావారిచే చేయబడినవి. మృదువైన పై చర్మంతో, లోపల విశాలంగా వున్నందున యిరుకనిపించదు. చకచక నడిచే పాదాలకు తగ్గ జోడు. ఎంత దూరం నడిచినా హాయిగా ఉంటుంది. ఈ రోజే మీ పిల్లలను తీసుకువచ్చి ఒక జత కొనుక్కోండి.

పింటు 61
రూ 7.95, 8.95, 10.95

సన్నీ 41
రూ 9.95, 11.95, 14.95

వేఫైడర్స్ 70
రూ 17.95, 19.95, 22.95

వేఫైడర్స్ 03
రూ 19.95, 22.95
26.95

న్యూ స్ప్రింగ్ 41
రూ 15.95, 17.95, 20.95

**Bata**

